# అపరాధ పరిశోధన

రు.3 డిసెంబర్ '75

సప్లిమెంట్



"PRABHAKAR"



# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## చివరి మనిషి

రచన : ముద్దా సురేష్

## ఐదుగురు యోధులు

రచన : సంపత్

## ద్రోహి

రచన : సుజనశ్రీ

## సాగర చక్రవర్తి

రచన : సుజనశ్రీ

"ఖైదీ" సీరియల్ - 19 వ భాగము

పరాధ పరిశోధన సప్లిమెంట్—24

డిసెంబర్, 1975

వెల : 3-00 రూపాయలు

ఏడాది చందా 39 రూపాయలు

ఉచిత చందా డిపాజిట్టు 250 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్ :

శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం :

టెంపోరావ్

శ్యాంబాబు

రమణశ్రీ

ఏ. వీ. మోహన్రావ్

సుజనశ్రీ

వసుంధర

కంచర్ల రమణ

కార్యాలయం :

అపరాధ పరిశోధన కార్యాలయం

నారాయణగూడ, హైదరాబాదు-29

ఫోన్-36959

ముద్రణ : క్రాంతి ప్రెస్, మద్రాసు-1

గెడా రంగారావు

# చివరి మనిషి

## ముద్దా సురేష్

అది 2000 వ సంవత్సరం!

పెరిగిపోయిన నాగరికతతో పాటు మానవుడిలో పేరుకు పోయిన స్వార్థపూరిత ఈర్ష్యాద్వేషాలకు వీడ్కోలుపాడిన వత్సరం!

ఎన్నడో పెద్దలు నగుమోముతో నుడివిన 'పెరుగుట విరుగుట కొరకే' నన్నసూక్తిని నిజంగా నిజంచేసిన రాహు నాగం! కేతుగానం!!

ఎన్నో వేల ఏళ్ళ బంగరు భవిష్యత్తు దూరంగ ఉండగనే కలియుగాంతాన్ని నిముషాల్లో కొని తెచ్చుకొన్న మనిషి మాత్సర్యానికి నిర్యాణం-2000 వ సంవత్సరం!

అదే మూడవ ప్రపంచయుద్ధం. ముచ్చటగా మూడు

గంటల్లో ముగిసింది. కలియుగం అంతమైంది.

ఎలా మొదలైందో, ఎవరు ప్రయోగించారో తెలియదు. ఓ చీకటి రాత్రిలో రెండు ఇంటర్ కాంటినెంటల్ బాలిస్టిక్ మిస్సైల్స్ (ఐ సి బి మ్) రివ్వున వెళ్ళి న్యూయార్క్ సిటీలో పడ్డాయ్. భూమి కంపించినట్లయింది. ఊహించని పరిణామం అది. లేకపోతే వాటి రాకను రాడార్లో చూసి యాంటీ మిస్సైల్స్‌తో వాటిని గాల్లోనే పడగొట్టొచ్చు. ప్రపంచమంతా అట్టుడికిపోయింది.

ప్రెసిడెంట్ ఆఫ్ అమెరికా రెచ్చిపోయి ఆర్డర్లు జారీ చేశాడు. అంతే మరుక్షణం సుమారు 6,000 మెగా టన్నుల హైడ్రోజన్ బాంబు బ్రహ్మప్రళయంతో బ్రద్దలైంది. దాంతో తిక్కరేగిన రష్యా న్యూట్రోజెన్ బాంబును ప్రేల్చింది.

జర్మనీ ఆటంబాంబు, మరోదేశం నేసాంబాంబు, ఏ దేశానికి ఆదేశం వాళ్ళు - వాళ్ళువాళ్ళు కనిపెట్టుకున్న బాంబులని పేల్చారు. దేవుడు బ్రెయిన్ వాష్ చేసాడేమో? ఆ సమయంలో ఏ ఒక్కడి మేధస్సు సక్రమంగా పని చేయలేదు.

దేశాల్ని శాంతపరచి మూడవ ప్రపంచయుద్ధం నిర్మూలించే ఆలోచన ఎవరికీ రాలేదు. వచ్చినా వాడిమాట పట్టించుకొనే నాధుడు లేడేమో!

ఏ సమయంలో ఎవడు గెలిచాడు? అన్న హుషారు ప్రతీవాడిలోను పేరుకుపోయింది. ఏ దేశానికా దేశం తమ గరిష్టశక్తిని ఉపయోగించింది.

నాశనం! సర్వనాశనం!

అంతా గంటల్లో, మూడు గంటల్లో జరిగిపోయింది. అన్ని దేశాల్లోను, బాంబులు వదిలిన చోట్ల వేల అడుగుల ప్రమాణంలో గోతులు పడ్డాయ్! బాంబుల తాలూకు పొగ ఆకాశంలో మబ్బుల్లా పేరుకుపోయింది.

ప్రపంచం మొత్తంలోని గాలి–అంటే ప్రాణవాయువు విషంగా మారింది.

ప్రాణంమీద తీపితో, నేరం చేసిన నేరస్థుడిలా, హత్యచేసిన హంతకుడిలా కంగారుపడిపోయి ప్రజలు తమను కాపాడుకొనే తొందరలో ప్రాణవాయువు భద్ర పరచుకోలేదు. సృష్టిలో చెప్పబడే అరవై నాలుగుకోట్ల జీవరాసులు ఆ విషవాయువుకి బలి అయిపోయాయ్.

సరిగ్గా అదేసమయంలో—

## 2

బీప్...బీప్...మన్న శబ్దం వినబడి ఉలిక్కిపడి ఓ స్విచ్ నొక్కింది–రోదసీ దుస్తుల్లో ఉన్న ఆస్ట్రొనాట్ మిస్. మంజుల. ఆమె ఎదురుగా రకరకాల యంత్రాలున్నాయ్.

మిస్. మంజుల భారతదేశం సరిక్రొత్తగా ప్రయోగించిన "శౌర్యభాట" అనే ఉపగ్రహంలో గ్లోబ్‌కి 200 మైళ్ళ ఎత్తున తిరుగుతోంది. భారత వైజ్ఞానికుల పురోభివృద్ధికి తార్కాణం 'శౌర్యభట.' భూతలంపై గనుల నిక్షేపాలను అన్వేషించటానికి ప్రయోగించబడిన శాటిలైట్ అది.

మిస్ మంజుల టెలివిజన్ స్క్రీన్ వైపు చూసి అదిరి పడింది. మామూలుగా గ్రౌండ్ కంట్రోల్ డైరెక్టర్ ముఖం కనపడ్డం లేదు అందులో. స్క్రీన్ తెల్లటి పొగలను సినిమాలా చూపిస్తోంది. హెడ్‌ఫోన్స్ చెవులకు తగిలించు

కున్న మంజుల పవర్ ఫుల్ టూవే రేడియో మైక్ 'ఆన్' చేసింది.

"ఆపరేషన్ శౌర్యభట...ఆపరేషన్ శౌర్యభట... దిసీజ్ మిస్. మంజుల. మిస్టర్ దులాల్ గుహ! వాట్ హాపెండ్? ఓవర్" స్విచ్ నొక్కింది మంజుల.

"గ్రాండ్ కంట్రోల్...గ్రాండ్ కంట్రోల్ డైరెక్టర్ దులాల్ గుహ రిపోర్టింగ్...మిస్. మంజుల! మధ్యలో ప్రశ్నలు వేయకు పూర్తిగా విను. కొంప మునిగింది. కాదు ప్రపంచం మునిగింది. బాంబింగ్ ప్రభావంచే ప్రపంచ మంతా సర్వనాశనమైంది మిస్ మంజులా! ఆకాశంలో పొగలు కమ్ముకున్నాయి. నా ముఖం నీకు కనబడదు. మేం నిర్ణయించిన లాండింగ్ డేట్ మర్చిపో. మరో రెండు నెలలదాకా భూతలంపై దిగే ప్రయత్నం చేయకు" ఊపిరి బిగించి ఎలాగో మాట్లాడుతున్న డైరెక్టర్ దులాల్ గుహ గొంతుపట్టుకొని ఖంగుఖంగున దగ్గుతూ ఏదో చెప్ప బోయాడు.

మిస్ మంజుల మళ్ళీ స్విచ్ నొక్కింది. "బట్ సర్! నాకు ఆహారం మరో 15 రోజుల కంటే సరిపోదు."

"స్టాప్ యువర్ నాన్సెన్స్ మంజూ! ఇల్లు కాల్తూంటే బీడీ కోసం వెతికినట్లు మాట్లాడకు. తిండి తగ్గించు కేవలం బ్రతకడానికి అవసరమైనంతే వేసుకో అ...యామ్ గోయింగ్ కిడ్! సృష్టిలో నువ్వే...చివరి మనిషివి. నేను చెప్పినట్లు..." జి. సి. డైరెక్టర్ దులాల్ గుహ మాటలు ఇంకా పూర్తి కాలేదు. అప్పటికే అతని ఊపిరితిత్తుల్లో విషవాయువు నిండుకొంది. ఎదురుగా ఉన్న యంత్రాలపై దులాల్ గుహ నిర్జీవంగా వాలిపోయాడు.

ఏదో అడగబోతున్న మంజుల ఒక్కక్షణం ఆగి పోయింది. "డైరెక్టర్!" ఆతృతగా పిల్చింది.

హియరింగ్ ఫోన్స్ మౌనం వహించాయ్. భవిష్యత్తు సూచిస్తూ ఆమె ముఖం పాలిపోయింది. మంజుల మస్తిష్కంలో ఆలోచనలు ఏటి వడ్డున చేపపిల్లలా గెంతసాగాయి.

# 3

గ్రౌండ్ కంట్రోల్ డైరెక్టర్ ఆదేశానుసారంగా, రెండు నెలల తర్వాత మిస్ మంజుల భూమిపై కాలు పెట్టింది. అంతా నిర్మానుష్యంగా కనిపించింది.

మిస్ మంజుల అయోమయంగా ఢిల్లీ నగరపు వీధుల్లో నడుస్తోంది. ఆమె ముఖం ఏదో అంతులేని భయాన్ని సూచిస్తోంది. రోడ్లమీద జనం ఎక్కడా లేరు. సన్నగా మంచు కురుస్తోంది. గాలికి రోడ్లమీద పడి వున్న కాగితాలు కొట్టుకుపోతున్నాయ్. నగరమంతా తుఫాన్ వచ్చి వెలిసినట్లు నిసబ్దత అలుముకుంది. కనీసం పశువులు, జంతువులు పక్షులు కూడా మచ్చుకైనా ఎక్కడా కనిపించడంలేదు.

రోడ్లమీద మాత్రం చాలా కార్లు, మోటార్ బైక్‌లు, వదిలివేయబడి దీనంగా చూస్తున్నట్లున్నాయి. కొన్ని కార్లు మామూలుగా రోడ్ ప్రక్కన పార్క్ చేసి వుంటే, మరికొన్ని వందల కార్లు రోడ్డు కడ్డంగా వదిలివేయబడి వున్నాయి. ఇంకొన్ని ఎలక్ట్రిక్ పోల్స్‌కీ, ప్లాట్‌ఫామ్స్‌కీ బిల్డింగులకీ గుద్దుకొని పగిలి పడివున్నాయి. వాటిలోని శవాల తాలూకు ఎముకలు చెల్లాచెదరుగా కనిపిస్తున్నాయి

నిశ్శబ్దం!

చాలా నిశ్శబ్దం!!

ఏ కవీ, ఏ రచయితా వర్ణించలేనంత నిశ్శబ్దం!!!

ఎక్కడా కనీసపు చప్పుడు కూడా లేదు. హోరుమనే గాలి శబ్దం తప్ప యింకేమీ లేదు. మిస్ మంజులకు మతి పోతోంది. కాదు పిచ్చెక్కిపోతోంది. ఏం చెయ్యాలో తోచడం లేదు. కాని ఈ విశాల ప్రపంచంలో తాను ఒంటరిగా ఎలా జీవించాలో తల్చుకుంటే ఆమె ఒళ్ళంతా చమటలు పడుతున్నాయి. అలా సాయంత్రంవరకు బజార్లు తిరుగుతూనే వుంది.

కొంత సేపటికి మంజుల తన కాళ్ళు పీకుతున్నట్లు గ్రహించింది. అటూ ఇటూ చూసింది. రోడ్ వారగా వున్న ఓ రోల్స్‌రాయిస్ కారు ఆమె నాకర్షించింది. దాని దగ్గరగా నడిచింది మంజుల. చిన్నగా నవ్వుకుంది.

ఇప్పుడు ప్రపంచంలోని ఆస్తి అంతా తనదే! తన కిప్పుడు ఇన్‌కమ్‌టాక్సు, వెల్తుటాక్సులాంటి భయాల్లేవు.

సీటు ప్రాంతంలో వున్న ఎముకలను, చర్మాన్ని రోడ్ మీదకి తోసేసి, విశ్రాంతిగా స్టీరింగ్ ముందు కూర్చొంది.

అంతలో......

ఆమెకు ఎవరో పరుగెడుతున్న శబ్దం వినిపించింది.

"ఆమెను చంపాలి...కొట్టు...పట్టుకో..." అన్న కేకలు వినపడ్డాయి.

మంజుల చెవులు రిక్కించింది. ఆ కేకలు...?? తనతో పాటు ఇంకా మనుషులు బ్రతికి వున్నారా?

మంజుల ఓ స్విచ్ నొక్కింది. హెడ్‌లైట్లు 'చక్'న వెలిగాయి. హెడ్‌లైట్ల కాంతిలో ఆమెకు యిద్దరు ముసుగు మనుషులు తన కారువైపే పరుగెత్తుకు రావడం కనబడింది. వాళ్ళ చేతుల్లో కర్రలున్నాయి.

విద్యుత్ కాంతి వాళ్ళ కళ్ళల్లో దూసుకుపోవడంతో ఆ యిద్దరు ముసుగు వ్యక్తులు కెవ్వున అరిచారు. అకస్మా

త్తుగా చేతులు కళ్ళ కడ్డం పెట్టుకొని వెనక్కి పరు గెత్తారు.

కాంతి ముఖం మీద పడినంత మాత్రాన కేకలు పెట్టడం ఎందుకు? ఎందుకు వాళ్ళలా కాలికి బుద్ధి చెప్పారు?

మంజులలో పట్టుదల పెరిగింది. ఆమె యాక్సిలేటర్‌ను అదుక్కుంటూ నొక్కింది. ముసుగు వ్యక్తులు మరింత వేగంగా పరుగెత్తసాగారు. సిమెంట్ రోడ్ మీద టక్ టక్... చప్పుడవుతోంది. రోల్స్‌రాయిస్ ఆ ఆకారాలకు దగ్గరైంది. ముసుగు వ్యక్తులిద్దరూ తప్పుకోచూసారు. అప్ప టికే ఆలశ్యమైంది. కారు ముందు చక్రాలు ఒకడి మీదకి ఎక్కాయి. వాడు కెవ్వున అరుస్తూ అప్పడంలా మారి పోయాడు. రెండో వ్యక్తి గబగబా ప్రక్కదారి పట్టాడు. మంజుల చివర ముడివేసి ఉన్న ఓ పొడుగాటి తాడును విసిరి అతన్ని ఉచ్చులా బంధించింది. అతను బలంగా గింజుకోసాగాడు. అయితే అలా చేసినప్పుడు యింకా బిగుసుకుపోతోంది త్రాడు.

ఆ ముసుడు వ్యక్తిని దగ్గరగా లాగి అతని వైపు చూసింది మంజుల. అంతే! ఆమె ప్రక్కలో బాంబు పడ్డ ట్లయింది!

ఆ వ్యక్తి ముఖం తెల్లగా పాలిపోయి రంగు పూసిన ట్లుంది. కళ్ళకు ఓ పగిలిన నల్ల కళ్ళజోడు వుంది. పాదాల దాకా నల్లటి ముసుగు. నల్లగా వుండాల్సిన కనుపాపలు తెల్లగా వున్నాయి. జుట్టు బూడిద రంగులో వుంది.

తాను తాడు లాగుతున్నప్పుడు అతను తేలికగా రబ్బరు బొమ్మలా వచ్చేయటం మంజుల గమనించింది.

"ఎవరు నువ్వు? ఎందుకు చంపాలనుకొన్నావు నన్ను?" కోపంగా అడిగింది మంజుల.

అతని పెదాలు కదిలాయి. "మా నాయకుడి ఆజ్ఞ. నువ్వు ఎక్కడున్నా చావు తప్పదు."

"వివరంగా చెప్పు. నువ్వు మనిషివా? దెయ్యానివా? ఇంత తేలికగా వున్నావేంటి?"

ముసుగు వ్యక్తి శబ్దం గాకుండా నవ్వాడు. "నన్ను దెయ్యం మనిషనుకో. అరవై రోజుల క్రితం బాంబింగ్ జరిగినప్పుడు కొంతమంది బార్స్‌లో పీకలదాకా తాగి పడున్నారు. అందులో నేనొకడిని. ప్రొద్దుట లేచి చూచే సరికి మా అవతారాలు మారిపోయాయి. మా ఒంట్లోని విస్కీ గాలిలోని ఆటంబాంబుల తాలూకు విషాన్ని విరిచేసి వుండాలి. మమ్మల్ని సగం దెయ్యం, సగం మనిషిగా చేసింది ఆ సంఘటన.

"మానవుల్లో నువ్వొకతెవే మిగిలావు. నిన్ను బ్రతకనియ్యం. ఈ ప్రపంచాన్ని మాలాంటి యాంటి-హ్యూమన్స్ పరిపాలిస్తాయి."

మంజుల నిశ్చేష్టయై అతని మాటలు వింటూంది. "నీ మీద పరిశోధనలు చేస్తాను. హాస్పిటల్స్‌లో రక్తం దొరుకుతుంది. నీకు ఎక్కించి మనిషిగా మార్చడానికి ప్రయత్నిస్తాను" అంది ఆశగా అతని వైపు చూస్తూ.

"వీల్లేదు. అది మా కట్టుబాట్లకు విరుద్ధం" గొణిగాడు ముసుగు వ్యక్తి.

మంజుల అతడికేసి వింతగా చూసింది. మంచిచేసి మనిషినీ చేస్తానంటే మారాం చేస్తున్నాడు. అంటే ఈ దెయ్యం మనుషులకి మానవుడిలో వుండాల్సిన ఆలోచనాశక్తి, మేధస్సు నశించి వుంటాయి.

"నేను పగలంతా తిరిగాను. నీలాంటి మనుషులు ఎవరూ కనబడలేదు. కారణం?" అడిగింది మంజుల.

"మాకళ్ళు డెలికేట్. కాంతిని మేం చూడలేం. అది మా శత్రువు, రాత్రిళ్ళు మాత్రం బయట తిరుగుతాం."

మంజుల కేదో ఆలోచన తట్టింది. అతని ముఖంలోకి లైటింగ్ పెట్టి భయంపెట్టి, అతనిమీద పరిశోధనలు చేయడానిక్కి ఒప్పించాలి అనుకుంది.

ముసుగు వ్యక్తిని తాడుతో బంధించి బాక్ సీట్లో పడేసింది.

"ఊరంతా మా సహచరులున్నారు. నన్ను ఎక్కడికీ తీసుకెళ్ళలేవు." అన్నా డతడు.

స్టీరింగ్ ముందున్న మంజుల ఒకసారి వెనక్కి చూసి కారుని ముందుకు దూకించింది.

కొద్దిదూరం వెళ్ళగానే రోడ్ కడ్డంగా ఓ చెట్టుపడి ఉంది. మంజుల సడన్ బ్రేక్ వేసింది. కారు వెనుకవైపు పకపకా నవ్వులు వినబడ్డాయి కదులుతూ.

మంజుల త్రుళ్ళిపడి తల వెనక్కి తిప్పింది. దెయ్యం మనుషులు చీకట్లోంచి గుంపులు గుంపులుగా కారు వెనక్కి పరిగెత్తుకొస్తున్నారు.

"వదలకండి! చంపండి!!" అని కేకలు వినబడు తున్నయ్.

బాక్ డోర్ దడాలున తెరచి—బంధించబడి ఉన్న ముసుగు వ్యక్తిని స్వాధీనం చేసుకొన్నారు దెయ్యం మను షులు. మరికొంతమంది చకచకా ముందు సీటు వద్దకు వచ్చారు.

అంతా నిముషాల్లో జరిగిపోయింది. కాదు క్షణాల్లో...

మంజుల హాండిల్ త్రిప్పి గబగబా సైడ్ మిర్రర్స్‌ని పైకెత్తింది. వాళ్ళు అద్దాన్ని బ్రద్దలు కొట్టే వుద్దేశంతో కర్రలు పైకెత్తారు.

'ప్రస్తుతం వాళ్ళ బారి నుంచి తప్పించుకోవాలి'. మంజుల ఆలస్యం చేయలేదు. బాక్ గేర్ వేసి చటుక్కున కారును వెనక్కి నడిపింది. ఊహించని పరిణామం అది. కారును చుట్టుముట్టిన ముసుగు వ్యక్తులు వెనక్కి విరుచుకు పడ్డారు.

మంజుల అతివేగంగా కారుని రోడ్ చివరకు నడిపింది. ముసుగు వ్యక్తులు తెగించి కర్రలతో ముందుకు పరిగెత్తుకు రాసాగారు. మంజుల ఈసారి యాక్సిలేటర్ని అదుక్కుంటూ నొక్కేసింది. రోల్స్‌రాయిస్ తారాజువ్వలా ముందుకు దూకింది.

కెవ్వున అరుస్తూ ప్రక్కకు తప్పుకున్నారు ముసుగు మనుషులు. రోడ్ కడ్డంగా వున్న చెట్టు కారు ముందు చక్రాలకు తగిలి ప్రక్కకి దొర్లింది.

కారు నిరాటంకంగా ముందుకు సాగిపోయింది. మంజుల స్వేచ్ఛగా వూపిరి వదిలింది.

# 4

ఉదయం పదిగంటలైంది.

మంజుల ఇప్పుడు నివశిస్తోంది ఇల్లుకాదు. ఓ పెద్ద బిల్డింగ్. అది ఒకప్పుడు ఢిల్లీలోని పెద్ద స్మగ్లర్‌ది. కొన్ని లక్షల ఖరీదు చేస్తుందది. జనరేటర్, స్విమ్మింగ్‌పూల్ లాంటి సదుపాయాలు కూడా వున్నాయి.

భవనంబైట ఏదో శబ్దమైంది. మంజుల కనుబొమ్మలు ముడివడ్డాయ్. చదువుతున్న పుస్తకాన్ని చటుక్కున మూసి మంచంమీంచి లేచింది. టీపాయ్‌మీదున్న నిమ్మరసం గ్లాసుని రెండుగుక్కల్లో పూర్తిచేసి, దానిప్రక్కనే నిద్రపోతున్న బ్రెన్‌గన్‌ని అరచేతిలో బిగించి గబగబా బాల్కనీలోకి పరిగెట్టింది. కళ్ళు చిట్లించి క్రిందకు

చూస్తున్న మంజుల ఉలిక్కిపడింది.

దెయ్యంమనుషులు చీకట్లో గుంపులు గుంపులుగా నిల బడి గుసగుసలాడుకుంటున్నారు. మరికొంతమంది నీళ్ళ గొట్టంమీంచి పాకుతూ బాల్కనీవైపు వచ్చేస్తున్నారు.

మంజుల ఎందుకో చటుక్కున ప్రక్కకి తప్పుకొంది. ఓ యీటెలాంటి ఆయుధం రివ్వున వచ్చి, ఆమె భుజం ప్రక్కగా దూసుకుపోయి నేలకూలింది.

మంజుల తనలో తాను నవ్వుకుంటూ స్థంభానికి అమ ర్చిన ఓ స్విచ్ నొక్కింది. అంతే! బాల్కనీకి రెండు వైపులా అమర్చబడ్డ ఫ్లడ్ లైట్లు 'ఛక్' మంటూ వెల్గాయి. ఆ ప్రదేశమంతా పట్టపగలైంది. కాదు. మిట్టమధ్యాహ్న మైంది. ముసుగుమనుషులు 'షాక్' కొట్టినట్లు కివ్వున అరుస్తూ ముఖానికి చేతులు అడ్డంపెట్టుకొని కాలికి బుద్ధి చెప్పసాగారు. మంజుల చేతిలోని బరువైన బ్రెన్ గన్ వేటకుక్కలా మొరిగింది. కొంతమంది వికృతంగా అరు స్తూనే నేలకూలారు.

ధన్ ధన్...ధన్ ధన్.

మంజుల చేతిలోని మారణాయుధం విపరీతమైన శబ్దం చేస్తూ విసనికర్రలా తిరిగింది. వాటర్ పైప్ అధిరోహిస్తున్న పిశాచాలు, పురుగుల్లా రాలిపోయాయి. కొంతసేపటికి వాతావరణం చల్లబడింది. మంజుల మానసికంగా అలిసి పోయింది.

రేపుదయాన్నే ఢిల్లీకి గుడ్ బై కొట్టాలి. గుడిచుట్టూ తిరుగుతూంటే తన బుర్ర పాడైపోతోంది. గమ్యంలేని జీవితం తనది. కొన్నాళ్ళు ఇలాగే గడిపేస్తే తనకు పిచ్చెక్కిపోతుందేమో! అవును! తను ఈ పరిస్థితుల్లో ల్యూనటిక్ అయిపోయినా ఆశ్చర్యపోనక్కరలేదు.

అప్పుడు...అప్పుడు...

ప్రపంచంలోని చివరి మనిషి పిచ్చిది!

మాడ్!

ఇన్ సేన్!

పగ్లీ!

మంజుల పిచ్చిదానిలా నవ్వుకొంది. శరీరం ఊగిపోయేలా నవ్వుతోంది. ఆమె సున్నితమైన మస్తిష్కంలో చెలరేగే 'లావా' ను ఆర్పడానికి ఆల్కహాలే పెదవి విరిచింది. మంజుల తూలుతూ వెళ్ళి ఫోమ్‌మీద వాలిపోయింది.

మంచానికి ఎదురుగా బీరువాకున్న నిలువుటద్దం ఆమె అమోఘ సౌందర్యాన్ని ప్రతిబింబించి, వెక్కిరించింది. మంజుల ముఖంలో నీలినీడలు క్రమ్ముకున్నాయ్!

తాను కన్య!

అనాఘ్రాత పుష్పం!

పదహారు వసంతాలు నిండని పరువం తనది.

"స్వీట్ సిక్స్‌టీన్" అనే పదం వాడేవాళ్ళు బ్రతికున్నప్పుడు మానవులు!

విజ్ఞాన సముపార్జనలో పడి తాను శారీరకసుఖాన్ని విస్మరించింది. దేశప్రజలచే చిన్నవయసులోనే తానో 'సాహస యువతి'గా స్త్రీ ప్రపంచాని కంతటికీ తలమానికంగా నిలబడాలనీ, ముద్ర వేసుకోవాలనీ, కన్య సహజంగా కనే బంగారు కలలను గొయ్యితీసి కప్పెట్టింది!

కాని...కాని...

మర్చిపోయిన ఆ శరీరశోభ ఇప్పుడు తనను వెక్కిరిస్తోంది! అద్దం ఆధారంగా తాను అందగత్తెనని తేలు

తోంది. కాని ఆ అందం అడవిమల్లెలా వాడిపోవాల్సిందేనా? మానసిక పరిపూర్ణతనిచ్చే ఇల్లాలి జీవితం, తల్లి జీవితం తన నుదుటిమీద వ్రాయడం మర్చిపోయాడా మందుకొట్టి బ్రహ్మదేవుడు?

ప్రపంచంలోని ఆత్మలన్నీ తనను చూసి నవ్వుతూనే ఉంటాయా?

మంజుల మెదడులో 'క్రోధం' పాముపిల్లలా కదులోంది. మెత్తని తలగడలో ముఖాన్ని దాచుకొని ఆమె కుమిలికుమిలి ఏడుస్తోంది.

మంజుల అయిదునిమిషాల తర్వాత కొద్దిగా పైకి లేచింది. తామర తూడులవంటి ఆమె చేతులు టీపాయ్ మీద వున్న చిన్నసీసాను అందుకున్నాయ్. సీసా లేబుల్ పైన 'యాల్లొనాల్' అన్న అక్షరాలు మెరుస్తున్నాయి. అవి ఇంగ్లాండ్ నుంచి దిగుమతి చెయ్యబడ్డ శక్తివంతమైన నిద్రమాత్రలు.

మంజుల రెండు టాబ్లెట్స్ నోటిలో వేసుకొని డ్రై 'జిన్' తాగింది. క్షణం తర్వాత గొంతుపట్టుకొని మత్తుగా వాలిపోయింది బెడ్ మీద.

## 5

ఎవరేమైపోయినా తనకు సంబంధం లేదన్నట్లు, 'ఎమర్జన్సీ'లో గవర్నమెంట్ ఉద్యోగిలా, సూర్యుడు తన కాంతిని భూగోళంమీదకి శక్తివంతంగా ప్రసరిస్తున్నాడు.

పాలం ఎయిర్ పోర్ట్ నిర్మానుష్యంగా వుంది.

మంజుల సిగరెట్ పీలుస్తూ పాసింజర్స్ లాంజ్ లోంచి ముందుకు నడిచింది. టార్ మెక్ పైన ఓ బోయింగ్ విమానం ఆగివుంది. మంజుల 'గాంగ్ వే'ను విమానంవైపు తోసుకుంటూ వెళ్ళింది. చకచకా మెట్లెక్కి బోయింగ్

అంతర్భాగం చేరింది.

ఫ్లయింగ్ క్లబ్‌లో తను హాబీకోసం నేర్చుకొన్న శిక్షణను జ్ఞప్తికి తెచ్చుకుంటూ పైలెట్ కాబిన్‌లోకి నడిచింది. కెప్టెన్ సీటులో కూర్చొని మంజుల ఇండియన్ ఎయిర్‌లైన్స్ రూట్‌మాప్ తిరగేసింది. చూపుడు వేలితో క్రింది పెదవిని రుద్దుకుంటూ అయిదు నిముషాలు తనలో తాను ఏదో గొణుక్కుంది.

చివరికి కాబూల్ మీదుగా మాస్కో వెళ్ళడానికి నిశ్చయించుకొందామె.

మాప్ మూసేసి మంజుల ఫ్యూయల్ మీటర్ వగైరాలను పరీక్షించింది. సీటుకి అమర్చబడిన ఇలాస్టిక్ బెల్ట్‌ను నడుం చుట్టూ బిగించింది.

అద్దంలోంచి రన్‌వేవైపు చూస్తూ, ఇంజన్ స్టార్ట్ చేయబోతున్న మంజులకేదో జ్ఞాపకం వచ్చింది. తాను పే లోడ్ చెక్ చెయ్యడం మర్చిపోయింది. బెల్ట్‌ని రిలీవ్ చేసి మంజుల విమానం వెనుకభాగంవైపు నడిచింది. డోర్ తెరిచి ఉలిక్కిపడింది.

లోపల ఏవో పాకేజ్‌లు నిండివున్నాయి. ఎవరేని పాసింజర్ల రద్దీవల్ల స్పెషల్ రిక్వెస్ట్ మూలంగా ఒకోసారి ప్లేన్ పేలోడ్‌ని పూర్తిగా నింపడం జరుగుతుంది. పే లోడ్ అంటే విమానం మోయగల గరిష్ట బరువు. సీనియర్ పైలట్ లేకపోతే అది అప్పుడప్పుడు ప్రమాదాలకి దారి తీస్తుంది.

బోయింగ్ ఫ్లయిట్‌ను తాను మొట్టమొదటిసారిగా డ్రైవ్ చేయబోతోంది. తనకు పెద్ద నైపుణ్యం లేదు. అలాంటప్పుడు పేలోడ్ మూలంగా విమానానికి ప్రమాదం వాటిల్లవచ్చు. మంజుల పాకేజీలను డోర్‌గుండా విమానం

బయటకి విసిరేసింది. ఆమె నుదుటికి పట్టిన చెమట తుడుచు కొంటూ కాక్‌పిట్ వైపు నడిచింది.

రెండునిముషాల తర్వాత ఇంజన్స్ స్టార్ట్ చెయ్య బడ్డాయి. విమానం టార్‌మెక్ మీంచి రన్‌వేమీదకి పాకి, అక్కడ్నుంచి వేగం రెట్టింపయింది. కొద్దిక్షణాల తర్వాత 'నోస్' పైకి లేచింది.

బోయింగ్ 707 మేఘాలమధ్య దూసుకుపోతోంది. మంజుల 'U' షేప్ రాడ్‌ని జాగ్రత్తగా త్రిప్పు తోంది. ముఖకవళికలుబట్టి ఆమె గుండె వేగంగా కొట్టు కుంటూందని చెప్పవచ్చు.

## 6

బోయింగ్ 707 ఆఫ్ఘనిస్తాన్ రాజధాని కాబూల్‌లో గ్రద్దలా వాలింది. మంజుల ముఖం విప్పారింది. 'సేఫ్ లాండింగ్' అనుకొంది ఉత్సాహంగా.

మంజుల 'నెర్వస్' తగ్గడానికి కొద్ది విస్కీ సేవించి కాబూల్ పట్టణంలోకి నడిచింది. ఆమెకు కొత్తగా ఏ విషయాలు అక్కడ కనబడలేదు. జీవంతోవున్న పసిపాప అయినా ఆమెకు కనబడలేదు. మంజుల రోడ్ వారగా వున్న ఓ పసుపురంగు ఓపెన్‌టాప్ కారులోకి దూరి ముందుకు పోనిచ్చింది.

అవును? తనను చూడ్డానికి ఎవరూ లేరు. సామరస్య సహజీవనంకోసం సంఘం లేక సమాజం ఏర్పరచిన సెన్సారిక్ రూల్స్ యిప్పుడు లేవుగా...

బట్టలు విప్పేసి నగ్నంగా తిరుగుతే...మంజుల తల విదిలించింది. 'ఛ...ఛ...ఏమిటి తనకు ఆదిమానవుడి ఆలోచనలు వస్తున్నాయ్' తనను తానే తిట్టుకుందామె.

మంజుల తృళ్ళిపడి ఎందుకో సడన్ బ్రేక్ వేసింది. కళ్ళు చిట్లించి భయంగా ముందుకి చూసింది. బుజ్... బుజ్...మంటూ శబ్దం వినబడుతోంది.

ఎదురుగా చూసి అదిరిపడింది మంజుల.

"ట్రి...ఫి...డ్స్" సన్నగా గొణిగింది. స్టీరింగ్ వీల్ మీద ఆమె చేతులు వణికాయి. ఎదురుగా ఓ కాలిబాట సన్నగా ఒంపులిరిగి వుంది. మార్గానికి అటు ఇటు చెట్లు, పొదలు వున్నాయి. రోడ్ కడ్డంగా పొడుగ్గా, లతల్లా వున్న కొన్ని మొక్కలు అటు ఇటూ కదుల్తున్నాయ్. అవి తనవైపే వస్తున్నాయ్.

మనిషిని చంపగల మొక్క అది. పూర్వం బోటనీ డిపార్టుమెంటు దాన్ని ఏ క్లాసిఫికేషన్ కి చెట్టాలో తెలియక తికమక పడింది. చివరకు శాస్త్రజ్ఞులు దానికోరకు కొత్త 'ఫైలమ్' నే సృష్టించారు. ట్రిఫిడ్స్ అని నామకరణం చేసారు.

చూడ్డానికి మామూలు మొక్కలా ఉండేదది. కాండం లావుగా, ఎలాంటి కణుపులూ లేకుండా నునుపుదేలి ఉంటుంది. ఈ కణువుల్లో ఎన్నో వందల సూక్ష్మ రంధ్రాలుంటాయ్. వాటికి ఆకులుండవ్. పెద పెద్ద తొడుగుల్లాంటివి మూడునాలుగు కాండానికి కలిసి ఉంటాయి. గాలికి అటూ ఇటూ ఊగుతూ మనిషి చేతులలాంటి భ్రమను కలిగిస్తాయి. వాటినే మేఘాహస్తాలు (సడోపోడియా) అంటారు.

సడోపోడియాలలో విషవాయువులుంటాయ్. అవి ఏ ప్రాణి దగ్గరగా వచ్చినట్టు పసిగట్టినా చేతులు విసిరినట్లే అది సడోపోడియాలను విసురుతోంది. అంతే! ఆ ప్రాణి అవుట్!

వాటికి గల సూక్ష్మరంధ్రాల్లోంచి విషవాయువులు పిచికారిలా వెలువడి ఆ ప్రాణిని చంపేస్తాయి.

శ్వాస క్వసనానికి కేటాయించబడిన కణాల్లోంచి బుజ్ బుజ్ మంటూ వింతశబ్దాలు వస్తయ్.

మంజుల ఆందోళిత మనస్కురాలై ముందుకు చూస్తోంది. ఇంతకీ అవి బయటికి ఎలా వచ్చాయ్?

జూలాజికల్ పార్కులో బంధిస్తారు వాటిని. ప్రాణి కోటి అంతమవటంతో అవి స్వేచ్ఛపొంది వుండాలి.

ఆ ట్రిఫెడ్స్ శరీరం మీద చరుస్తే చర్మంమీద పచ్చని చారలు పడతయ్. ఆ దృశ్యాన్ని ఊహించిన మంజులకు ఒళ్ళు గగుర్పొడిచింది.

'అణుబాంబుల బారినుండి తప్పించుకోగలిగిన ప్రపంచం లోని చివరిమనిషి ఏదో జాతి మొక్కలతోటి చంపబడు తోంది. డామ్ షేమ్' అనుకొంది మంజుల.

కారు ముందుకు వెళ్ళామంటే వీలులేదు. ట్రిఫిడ్స్ నాగు పాముల్లా దారికాసాయ్! రెండు వైపులా ఉన్న పొదల నిండా అవే! నేలమీదవి మెల్లిగా ముందుకువస్తున్నాయ్. మంజుల కారు బాక్ చేసే ఉద్దేశంతో వెనక్కి చూసింది. ఆమె గుండెలు దడదడ లాడాయి. వెనుక వైపు కూడా ట్రిఫిడ్స్ హీరోయిన్ ని రేప్ చేయడానికి వచ్చిన విలన్ నవ్వుతున్నట్టు కదులుతున్నాయ్.

తలుపులు బిగించి కూర్చోడానికి వీలులేదు. ఖర్మకొద్దీ అది ఓపెన్ టాప్ కార్. మంజుల శరీరమంతా ముచ్చె మటలు పట్టాయ్.

రెండే రెండు క్షణాలు నిర్మలమైన మనస్సుతో కళ్ళు మూసుకొంది మంజుల. ఆమె మెదడులో ఏదో మెరి సింది.

ఆమె చటుక్కున పైకిలేచింది. చకచకా వెనుక సీటులోకి ప్రాకి 'డిక్కీ' వెనగ్గా తెరిచింది, మరుక్షణం ఆమె చేతిలో ఓ పెట్రోల్ డబ్బా ప్రత్యక్షమయింది.

ట్రిఫిడ్స్ తమ లక్ష్యం వైపు వేగంగా వస్తున్నాయ్.

మంజుల ఆలస్యం చేయలేదు. కారు ముందు భాగాన్నీ, వెనుక భాగాన్నీ పెట్రోలుతో తడిపేసింది. రెండు అగ్గి పుల్లలు ఖర్చుచేసి కారు రెండు వైపులా విసిరింది.

'దప్' మంటూ అంటుకొంది పెట్రోల్. కారు వెనుకా ముందూ మంటలు భగభగ మండుతున్నాయి. ట్రిఫిడ్స్ పిల్లిని చూసిన ఎలకలా వెనక్కి తగ్గాయ్. మంజుల కారుని రాకెట్ లా ముందుకు దూకించింది. కారుతోపాటుమంటలు ముందుకు కదిలాయ్. ట్రిఫిడ్స్ చకచకా పాకి వెనక్కి తప్పుకున్నాయ్. కారు కదులుతూంటే మంటలు ప్రయాణి స్తున్నట్లుంది.

ఆలస్యం చేస్తే తాను బొగ్గుగా మారుతోంది. చక చకా ఆలోచించింది. ముందుకు చూస్తున్న ఆమె కళ్ళు మెరిసాయ్. అంతే! మంజుల స్టీరింగ్ వదిలేసి నేర్పుగా రహదారి వారగా ప్రవహిస్తున్న చెరువులోకి దూకేసింది. మండుతున్న కారు ఓ చెట్టుకు రాకెట్ లా గుద్దింది.

పెద్ద విస్ఫోటం.

కరకర కాలిన చప్పుడు.

# 7

బోయింగ్ 707 ఆకాశాన్ని చీలుస్తూ ఎగురుతోంది.

మంజుల విమానాన్ని ఈసారి ఉత్సాహంగా నడుపు తోంది. ఒకసారి అలవాటవడంవల్ల విమానాన్ని నడప డంలో ఆమెకు సెల్ఫ్ కాన్ఫిడెన్స్ ఏర్పడింది. తాను ఇరవై నిముషాల్లో మాస్కో చేరపోతోంది. మంజులకి

తాను ఎప్పుడో పుస్తకాల్లో చదివిన మాస్కో విశేషాలని స్వయంగా చూడబోతున్నందుకు ఉషారుగా వుంది.

పెట్రోగ్రాడ్, లెనిన్‌గ్రాడ్, రోస్టన్ ఆన్ డాన్, స్టాలిన్‌గ్రాడ్ పట్నాలు, ఎయిర్ కండిషన్డ్ మెట్రోరైళ్ళు, ఎలక్ట్రిక్ బస్సులు, క్రెమిలిన్ రాజభవనం జార్ చక్రవర్తుల పురాతన 'గ్రనోవిటయా పలాటా' కట్టడం, ఇంకా రెడ్ స్క్వేర్, అంతటి మహత్తర కట్టడం మరోచోట కట్టకూడదని పనివాడి కళ్ళు పీకించేసిన యివాన్ రాజు, సెయింట్ బేసిల్ చర్చ్, లెనిన్ మ్యూజియమ్, ముఖ్యంగా సంవత్సరాల తరబడి కృశించని విధంగా అమర్చబడిన లెనిన్ మహాశయుడి మృతదేహం తాను చూడబోతోంది.

తన జీవితంలో ఎప్పటినుంచో ఉన్న ఆకాంక్ష ప్రపంచాంతంలో నెరవేరుతోంది.

మంజుల ఆలోచనల్లోంచి ఉలిక్కిపడింది. ఆల్ ప్రూఫ్ గ్లాసెస్‌గుండా ముందుకు చూసింది. ఆకాశంలో ఏదో అలజడి అగపడుతోంది. గాలి సుడులు తిరుగుతూ ప్రయాణించడం ఆమె కంటపడింది, మంజుల నిలువెల్లా వణికిపోయింది.

సందేహం లేదు. తుఫాన్!

కొద్ది నిముషాల్లో విమానం భయంకర తుఫాన్‌లో చిక్కుకోబోతోంది. ప్రాపర్ ఇన్‌స్ట్రక్షన్స్ ఇవ్వడానికి గ్రౌండ్ కంట్రోల్ సదుపాయాలు తనకులేవు. అంతటి భయంకర తుఫాన్‌లో నేర్పుగా తాను విమానం దించగలదా?

భగవాన్! మరోపదిహేను నిముషాల్లో సిరిమట్ జావో

విమానాశ్రయంలో హాయిగా దిగబోతున్న నాకీ పరీక్ష ఎందుకు పెట్టావ్?

స్త్రీలో ఉండే సహజమైన అబలా లక్షణాలు మంజుల మస్తిష్కంలో విజృంభించాయ్. విమానం అప్పటికే గాలిలో అల్లల్లాడుతోంది. మంజుల యావత్ శక్తినీ ఉపయోగించి బోయింగ్‌ను కంట్రోల్ చేస్తోంది. తుఫాన్ గాలి విమానానికి ముందు భాగాన ఉన్న ఆల్ ప్రూఫ్ అద్దాన్ని గుద్దుతోంది.

మంజుల ఏదో ఆలోచించి మాప్ తెరిచింది.

సిరిమెట్ జావో ఎయిర్‌పోర్ట్‌కి ముందుగా ఏవైనా విమానాశ్రయాలు ఉన్నాయేమోనని చూసింది. ఆమె కొంతసేపటికి పెదవి విరిచింది నిస్సహాయంగా.

మాస్కోకి సిరిమట్ జావో 20 మైళ్ళ దూరంలో తూర్పున ఉంది. బైకావో విమానాశ్రయం ఊరికి 20 మైళ్ళ దూరంలో ఉత్తరంగా ఉంది. మూడవది ఉమాకో ఎయిర్‌పోర్ట్. అది మాస్కోకి 15 మైళ్ళ దూరంలో పడమటి దిశగా ఉంది. మాస్కోకి దూరంగా ఏవీ కనబడలేదు.

ఈ భీభత్స వాతావరణంలో తాను ఎక్కడ దిగగలదు? 'లైఫ్ ఎండ్స్ ఇన్ మినిట్స్' అనుకొంది మంజుల.

మంజులకేదో జ్ఞాపకం వచ్చి అదిరిపడింది.

అవును! రష్యాలో మంచు ఎక్కువ. రష్యన్ ఎయిర్‌పోర్టులు మంచుతో కూడుకుని ఉంటాయి.

"రన్ వే"ని రోజురోజు క్లీన్ చేయాల్సి ఉంటుంది. సుమారు రెండు నెలలుపైగా వాటి దిక్కు దివాణం చూసేవాడు ఉండడు. అంటే అవి ఇప్పటికి రెండు గజాల

మందంలో ఐస్‌తో నిండుకొని ఉంటాయ్. మంజుల ఆత్మ స్థయిర్యం నశిస్తోంది.

బోయింగ్ 707 యూనియన్ ఆఫ్ సోవియట్ సోషలిస్ట్ రిపబ్లిక్స్ భూభాగం మీద రెక్క తెగిన పక్షిలా పరుగెడుతోంది. గాలి వత్తిడికి తలుపులు దబదబలాడుతున్నాయి. ఆల్టీమీటర్ వైపు ఓసారి చూసింది మంజుల. మూడు మైళ్ళ ఎత్తులో వుంది విమానం. మంజుల ఇక తెగించడానికే నిశ్చయించుకొంది.

రెండు కాళ్ళను డ్రైవింగ్ రాడ్ మీద తన్నిపెట్టి నడుముకు పారాచూట్ బిగించింది. సేఫ్టీ బెల్టు విప్పేసి 'ఎమర్జన్సీ ఎగ్జిట్' తెరిచింది. గాలి కాబిన్‌లోకి 'రయ్' మంటూ దూసుకు వచ్చింది.

మంజుల భగవంతుడ్ని చివరిసారిగా ధ్యానించి గాల్లోకి దూకింది. కలర్‌ఫుల్ పారాచూట్ గొడుగులా విచ్చుకుంది. మంజుల కళ్ళు అలసటగా మూతలు పడ్డాయి. విమానం సుడిగాలిలో యిరుక్కొని బొంగరంలాతిరుగుతూ నేలకూలడం ఆమెకు లీలగా కనిపించింది. అలాగే ఆమె స్పృహతప్పిపోయింది.

# 8

మంజులకి స్పృహ వచ్చేసరికి తన నెవరో మోసుకుపోతున్నట్లు గ్రహించింది.

మినీస్కర్ట్, బ్లౌస్‌తో వున్న ఆమె కోమల శరీరాన్ని చలి కొరికి కొరికి వదలిపెడుతోంది. వళ్ళంతా విపరీతమైన నొప్పులు...సన్నగా గాలి వీస్తోన్న శబ్దం, ఆమె కర్ణేంద్రియాలను సోకుతోంది.

అసలు తానెలా బ్రతికింది? పారాచూట్ నేలమీదకు దిగేటప్పుడు సరియైన పద్ధతి అవలంబించకపోతే కాళ్ళు

తిరుగుతాయి, మెడ వంకరపోతుంది.

కాని...స్పృహలేని స్థితిలో తానెలా 'లాండ్' అయింది? ఏ 'ఇంజరీస్' లేకుండా తానెలా బయటపడింది?

మంజుల కళ్ళు మూసుకొనే ఆలోచిస్తోంది.

య్యస్, బహుశా తను మెత్తని మంచులో కూలిపోవడంవల్ల తను రక్షింపబడి వుంటుంది. ఇంతకూ తనను మోసుకుపోతున్నది ఎవరు? మనుషులు బ్రతికి లేరుగా?

మంజుల బలహీనంగా కళ్ళు విప్పింది. అంతా చీకటి. కీచురాళ్ళ రొద. ఆమె కళ్ళు చిట్లించి చూసింది. అంతే! ఆమె నవనాడులు క్రుంగిపోసాగాయి. ఆమె స్పైనల్ కార్డ్ లోంచి చలి పుట్టుకొచ్చింది.

తనను మోసుకుపోతున్నది ఎవరో కాదు.

ముసుగు వ్యక్తులు!

దెయ్యం మనుషులు!

యాంటీ-హ్యూమన్స్!!

ఓ నిర్మానుష్యమైన వీధిలోంచి మోసుకుపోతున్నారు.

దూరంగా ఏదో మోటర్ సైకిల్ శబ్దం వినబడుతోంది.

మంజుల లేని ఓపికను తెచ్చుకుని తన చేతులని కాళ్ళని బలంగా గుంజింది. అంతే! ఆమె నేల మీద దబ్బున పడింది.

సరిగ్గా అదే సమయంలో మోటర్ సైకిల్ వైపునుండి ధన్...ధన్...మంటూ కాల్పులు వినబడ్డాయి. యిద్దరు పిశాచాలు కెవ్వున అరిచి నేలకూలాయి.

మంజుల అక్కడే చతికిలబడి వింతగా చూస్తోంది. మోటర్ సైకిల్ చక్కర్లు కొడుతూ మిగతా యిద్దరిమధ్య నుంచీ దూసుకుపోయింది. వాళ్ళ కాళ్ళ మీదుగా పరిగె

త్తాయి చక్రాలు. ఆ యిద్దరూ నేలమీద పడి వికృతంగా అరవసాగారు.

మంజుల మోటర్ సైకిల్ నడుపుతున్న వ్యక్తిని పరీక్షగా చూసింది. అతను...?

దెయ్యం కాదు!

అందమైన యువకుడు!

బలిష్టమైన యువకుడు!!

అతని చేతిలో ఎ. కె. 47 రష్యన్ గన్, నూనె రాసి నట్లు మెరుస్తోంది.

"మిస్..." అన్నాడు ఆ యువకుడు.

"మంజుల" అందామె బలహీనంగా.

"నా పేరు పోవిన్‌స్కీ. సోవియట్ దేశస్థుడనని ఈపాటికి గ్రహించేసి వుంటావు. ఆకాశంలో విమానం కనబడి ఆశ్చర్యపోయాను. అది కూలిపోవడం కూడా చూశాను. నీ కోసం వెతుక్కుంటూ బయల్దేరాను.

"ఆ దెయ్యాల గుంపు మరోటి రాకుండా మనం యిక్క డ్నుంచి పారిపోవాలి. గెటప్" అన్నాడు ఇంగ్లీషులో పోవిన్‌స్కీ.

"నో. యిక్కడ్నించి కదల్లేను. చలివల్ల నా శరీరం కొయ్యబారినట్లుంది."

"ఆల్ రైట్" అంటూ జేబులోంచి ఓ బాటిల్ని తీసాడు పోవిన్‌స్కీ.

"ఏమిటది?"

"ముందు తాగు తర్వాత చెప్తాను" బాటిల్ని పళ్ళ క్రింద నొక్కిపెట్టి ఓపెన్ చేశాడు పోవిన్‌స్కీ.

బాటిల్ని ఆమె నోటికి ముందుంచాడు పోవిన్‌స్కీ.

మంజుల రెండు గుటకలు వేసింది. ఆమె శరీరంలో నూతనో త్తేజం ప్రవేశించింది. వేడి కరెంట్‌లా ప్రవహించింది.

"చాలా బాగుంది, ఏమిటిది?"

"రష్యన్ వోడ్కా" అన్నాడతను నవ్వుతూ. "క్విక్ మోటర్ సైకిల్ ఎక్కు" పోవెన్‌స్కీ తన చేతిని అందించాడు. మంజుల తూలుతూ లేచి నిలబడింది.

దూరంగా ఎవరో పరిగెడుతున్న శబ్దం అవుతోంది. పోవెన్‌స్కీ మోటర్ సైకిల్ స్టార్ట్ చేశాడు. మంజుల అతనికి వెనుక కూర్చుంది. 'బర్' మంటూ స్టార్టయింది మోటర్ బైక్.

"హోల్డుమి టైట్" అన్నాడు పోవెన్‌స్కీ.

మంజుల అతని నడుం చుట్టూ చేతులు బిగించి వీపు మీద తల ఆన్చి కళ్ళు మూసుకొంది.

"థింగ్స్ గో బెటర్ విత్ వోడ్కా" అంది మత్తుగా.

# 9

ఫోమ్ బెడ్ మీద పసిపాపలా పడుకొని వుంది మంజుల. పోవెన్‌స్కీ నిస్సహాయంగా ఓ స్టూల్ మీద కూర్చున్నాడు. నిప్పు రాజేద్దామంటే పొడి కట్టెలు దొరకలేదు గతరాత్రి వర్షంవల్ల. ఆమె అరచేతులు, అరికాళ్ళు వేడి చేయసాగాడు పోవెన్‌స్కీ. అయినా ఆమెలో చలనం లేదు. "మంజూ!" ఆమె చెంపలు ప్రేమగా తట్టుతూ పిల్చాడు.

మంజుల ఏదో గొణుగుతోంది. చలివల్ల ఆమె పెదాలు వణుకుతున్నాయి.

పోవెన్‌స్కీ వెనక్కి తగ్గి రెండు క్షణాలు మంజుల వైపు చూస్తూ ఆలోచించాడు. ఎత్తయిన ఫోమ్ బెడ్‌లో

వీనస్‌లా మెరుస్తోంది మంజుల.

పచ్చటి బంగారు ఛాయ,
అందమైన ముఖం,
విశాలమైన కళ్లు,
సన్నగా పొడవైన చక్కటి ముక్కు,
చీల్చిన దొండపండులాంటి పెదాలు,
నునుపు దేరిన గడ్డం;
శంఖంలాంటి మెడ,
బాగా ఎత్తయిన స్తనాలు.
సన్నటి నడుము.

పొవెన్‌స్కీ ముందుకు నడిచి మంజులమీదకి వాలి పోయాడు. లక్కపిడతలాంటి ఆమె నోటిని, తన పెదిమ లతో బిగించాడు. తన కాళ్ళను ఆమె కాళ్ళకు పెన వేశాడు. అతని చేతులు ఆమె బ్లౌస్ బటన్స్‌ను ఊడ దీసాయి. లోపల బ్రాసియర్ లేదు. అమోఘమైన ఆమె రొమ్ములు బైటపడ్డాయి. అతని కళ్ళు చెదిరాయ్.

అతను ఆమె వక్షోజాలపై చేతులువేశాడు.

అతనిలో నరాలు పురెక్కి తెగిపోతాయ్ అన్నంత ఆవేశం రగుల్కుంటోంది.

అమోఘమైన అందం ఆమెది. ఆమెకు వేడి కావాలి. ఇంకా కళ్ళు తెరవలేదామె.

ఆమె గొమ్ముల నునుపుకి అతనిచేతులు జారుతున్నాయి. చెయ్యి ఒకచోట ఉండకుండా ఆమె ప్రదనానికి గతి తప్పుతోంది.

మంజుల ఉన్నట్లుండి కళ్ళు తెరిచింది. ఆమె ఉలిక్కి పడింది. "ఎక్కడ వున్నాను నేను?" అంది తల విదిలించి.

"మంజూ! మోటర్ సైకిల్ — పొవెన్‌స్కీ!" అన్నా

డతను.

మంజులకు అన్ని విషయాలు చకచకా జ్ఞాపకం వచ్చాయి.

"మంజూ! ఐ బెగ్ యువర్ పార్డన్. నన్ను క్షమించు." అన్నాడతను ఆమె చెంపలు నిమురుతూ. మంజుల తన చేతిని అతని మెడచుట్టూ పెనవేసి అతని క్రిందిపెదవి కొరికింది.

"నా బెటాల్ డియర్..." అంటూ అతడిని తన మీదికి లాక్కుంది.

పొవిన్‌స్కీ ముఖం విప్పారింది. ఆమెను రెండు చేతుల మధ్య బిగించి మెడక్రింద ముద్దుపెట్టుకుని, పులిలా విజృంభించాడు.

# 10

సంతృప్తిగా చూస్తున్న మంజుల శిరోజాలను అతను ప్రేమగా నిమిరాడు.

"మంజూ! భారతదేశపుటమ్మాయిలు అందంగా వుంటారని విన్నాను గానీ, అలాంటి శాంపిల్ ఒకటి నాకు దక్కుతుందని కల్లోకూడా అనుకోలేదు." అన్నాడు పోవిన్‌స్కీ ఆమె కళ్ళల్లోకి చూస్తూ.

మంజుల కళ్ళతో నవ్వింది. ఆమె కనురెప్పల వెంట్రుకలు పొడుగ్గా నల్లగా వంపు తిరిగివున్నాయి.

మంజుల చటుక్కున అతన్ని కౌగలించుకొంది. "పోవిన్! దేవుడిమీద ప్రమాణంచేసి చెప్పు. నన్ను విడిచి ఎక్కడికీ వెళ్ళవ్ కదూ!" అర్థింపుగా చూస్తూ అడిగింది మంజుల.

అతను ఆమె మెడని సున్నితంగా నిమిరాడు. "మంజూ! పిచ్చి ఆలోచనలు చేస్తున్నావ్. పోతే—

దేవుడిమీద రష్యన్లకు నమ్మకంలేదు. దేవుడిపేరు చెప్పి దుర్మార్గాలు చేయడంకంటే మానవశక్తితో మంచితనాన్ని సాధించడమే రష్యన్ల ఆశయం."

"నో ప్రోవిన్! దేవుడున్నాడు. నువ్వు నాకు దేవుడిచ్చిన వరం. లేకపోతే మనం కల్సుకోము అసలు. ఒంటరి బ్రతుకులు బ్రతుకుతూ కొన్నాళ్ళకు చచ్చివుండేవాళ్ళం."

ప్రోవిన్ నవ్వుతూ ఆమె అరచేతిని చేతిలోకి తీసుకొన్నాడు. "ఆల్ రైట్! మంజూ! నీ కోసం నా అలవాట్లు, నమ్మకాలు మార్చుకుంటాను. సరేనా! దేవుడు వున్నాడు. గాడ్ ఈజ్ దేర్. ఇంతకూ నీ దేవుడిపేరు చెప్పు, ప్రమాణం చేస్తాను."

"వెంకటేశ్వరస్వామి."

"వెంకట్ శరశామోవ్ అదేం పేరు. జీడిపప్పు నవిలినట్లుంది."

మంజుల పకపకా నవ్వింది. ఆ నవ్వులూ అల్లరి విన్నాక ఋష్యశృంగుడికైనా ఏదో నేరం చేయాలనిపిస్తుంది.

"నమస్కారం తల్లీ! నీ దేవుడిపేరు నేను పలకలేను." అంటూ ఆమె నోటిమీద చెయ్యివేశాడు.

"మంజూ! నువ్వే నా ప్రాణం! నీ పెదవుల తోడుగా నిన్ను వదిలి ఒక్క క్షణంకూడా గడపను సరేనా?"

మంజుల ప్రేమాతిశయంతో అతన్ని గుండెలమీదకి లాక్కుంది.

"ప్రోవిన్. మరి మనం పెళ్ళి ఎప్పుడు చేసుకొందాం" అమాయకంగా అడిగింది మంజుల.

ప్రోవిన్ వానజల్లులా నవ్వాడు. "పిచ్చిపిల్ల! అది సంఘంకోసం ఏర్పరచబడ్డ నియమం. నిన్ను వదిలేసి దేన్నో ఎత్తుకుపోడానికి నాకు దెయ్యాలు తప్ప ఎవరూలేరు."

"సారీ డార్లింగ్!" మంజుల నాలిక కొరుక్కొంది.

"ఇట్సాల్ రైట్ డార్లింగ్! అసలువిషయం విను. మనం రేపట్నుంచీ హానీమూన్ కి వరల్డు ట్రిప్ వెడుతున్నాం. అడిగే రాస్కెల్ లేడు కాబట్టి మనకి పాస్ పోర్టులు, వీసాలు అక్కర్లేదు. రైళ్లు కార్లు, విమానాలు, సబ్ మెరీన్ లు అన్నీ మనవే!"

"మీ దేశంలోని కాశ్మీర్ లో మనం ప్రేమించుకోవాలి. పారిస్ లో ఈఫిల్ టవర్ దగ్గర మనం ఆడుకోవాలి. ఇంకా వండర్స్ ఆఫ్ ది వరల్డ్ అన్నీ ఒకటొకటిగా చూస్తాం. ఒకో దేశ రాజధానిలో ఒకోసారి, ఒకో పద్ధతిలో..." అంటూ మంజుల చెవిలో ఏదో చెప్పాడు.

"ఛీ, పాడు మాటలు" అంది మంజుల సిగ్గు పడిపోతూ.

"ఇంతకీ వస్తావా? నీకు టూరింగ్ బోర్ అంటే మానేద్దాం."

"పోవిన్. నువ్వు ప్రక్కన వుంటే నేను నరకంలోకయినా రెడీ."

"మంజూ!ఐ లవ్ యూ!" అన్నాడతను ఆనందంగా.

"మంజూ లవ్స్ యూ డార్లింగ్" అందామె తడిసిన కళ్ళతో.

* * *

"'ది లిబరేషన్' పిక్చర్ చూశావా?"

"య్యాస్ పోవిన్! అందుకే నిన్ను ఎక్కడో చూసినట్లుంది అని చెప్పాను. ఆ వార్ లో నీ కుడిచెయ్యి విరిగిపోయింది కదూ." అంది మంజుల ప్రశ్నార్థకంగా.

"మంజూ! అది సినిమా!" అన్నాడతను నవ్వుతూ.

"ఓహ్! హాట్సాఫ్ టు ది టెక్నీషియన్స్. నీ మొండి చేతిలోంచి రక్తం కారడం చూసి నిజంగానే అలా అనిపించింది. భయంవేసిందికూడ."

"మంజూ! ఆ విషయం అలా వుంచు. నేను బ్రతికి

వుండేగలగడంలో వున్న రహస్యం చెబుతున్నాను నీకు. స్వంతంగా ఓ పిక్చర్ తీయాలనే తలంపు వచ్చింది నాకు. నాకు ఫొటోగ్రఫీ అంటే పిచ్చి యిష్టంగా వుండేది. నా చిత్రానికి కామెరా బాధ్యత నేనే వహించడానికి పూనుకున్నాను.

"ఆర్కిటిక్ సముద్రంలో ముత్యాలు ఏరే సీన్ తీయవలసి వచ్చింది. లొకేషన్ కోసం సముద్రంలో మకాం వేశాను. బాతిస్కోపు సప్లై చేసింది నాకు ప్రభుత్వం. అందులో కావల్సినన్ని ఆక్సిజన్ సిలిండర్స్ వున్నాయి." పోవిన్ కంఠం గద్గదమైంది. "మంజూ! నా పని పూర్తి చేసుకొని నటీనటుల్ని తీసుకువెళ్ళడానికి భూతలంపైకి వచ్చాను. కాని అప్పటికే ఆలస్యమైంది. ప్రపంచమంతా నాశనమైందని తెల్సుకొన్నాను. ఆల్కహోల్ ప్రభావం చేత యాంటి-హ్యూమన్స్‌గా మారిన నా యూనిట్‌లోని నటులు విచక్షణారహితంగా నన్నే చంపడానికి ప్రయత్నించారు." అంటూ ఆగాడు పోవిన్‌స్కీ.

"పోవిన్! మనం గతాన్ని త్రవ్వుకోవద్దు" అందామె ఓదార్పుగా. పోవెన్‌స్కీ తల వూపాడు. ఆమె భుజం చుట్టూ చేయివేసి దగ్గరగా నడుస్తూ అన్నాడు.

"అవును మంజూ! సృష్టి మనద్వారా మళ్ళీ ప్రారంభం కాబోతోంది. మన చరిత్ర భావితరంవాళ్ళు పాఠాలుగా చదువుకుంటారు. అదే మనకు సంతృప్తి."

మంజుల నవ్వుతూ అతని చేతికో సిగరెట్ ఇచ్చింది. ఇద్దరు సిగరెట్లు పీలుస్తూ, ఒకరి చేతుల్నొకరు బంధించుకొని అందమైన మాస్క్వానది వేపు పరుగులు తీసారు.

(ఆంగ్లచిత్రం 'ఒమేగామాన్' ఆధారంగా.

—: ఐపోయింది :—

# ఐదుగురు యోధులు

## సంపత్

ఆదోక జైలు!

ఆ జైలు చుట్టూ పది అడుగుల ఎత్తులో పటిష్టమయిన గోడ కొండరాతితో నిర్మించబడి వుంది.

జైలు భవనాలముందు, విశాలమయిన ఖాళీ స్థలంలో వరసగా నిలబడి వ్యాయామం చేస్తున్న ఖైదీలంతా, మెయిన్ గేటు తెరుచుకొని ఒక జీప్ రివ్వున రావటంతో, వ్యాయామం ఆపివేసి ఎక్కడి వారక్కడే నిలబడి పోయారు.

జీప్ లో నుండి పొడుగ్గా, బలిష్టంగా నున్న ఒక వ్యక్తి క్రిందకుదిగి ఖైదీలనందరినీ పరిశీలించాడోమారు. అతను మిలటరీ యూనిఫాంలో ఉన్నాడు. బలిష్టంగా, కండలు తిరిగి

ఉన్నాడు. మీసాలు లేవు. అయినా అతని ముఖం అందంగానే ఉంది. తలపై కేప్ ఉంది.

అందరూ అతన్ని విచిత్రంగా చూశారు. కారణం, సాధారణంగా అక్కడికి ఎవరూ రారు.

అతిప్రమాదకరమైన వ్యక్తుల్ని బంధించే జైలు అది. దాని ఉనికే సరిగ్గా తెలియదు చాలా మందికి. ఒకసారి దానిలోనికి ప్రవేశించితే తిరిగి రావటం కల్ల. ఆ జైలు చుట్టూ కట్టిగోడ పది అడుగుల ఎత్తులో నిర్మింపబడి ఉంది. ఒకేఒక మెయిన్ గేటు. అక్కడ ఎప్పుడూ కాపలా ఉంటుంది. అదీగాక గోడపై తీగలో వల ఉండి, దానిలో రాత్రి సమయంలో కరెంటు ప్రవహిస్తుంటుంది.

అటువంటి ఆ జైలులోకి వచ్చిన ఆ మిలటరీ వ్యక్తిని ఖైదీలంతా కుతూహలంగా చూడసాగారు. అతను ప్రతి ఖైదీ వద్దకు వెళ్ళి నిశితంగా చూడనారంభించాడు.

ఆ మిలటరీ వ్యక్తి వెనుకే జైలు సూపరింటెండెంట్ నడవసాగాడు. చేతులు వెనక పెట్టుకొని, ఒక్కొక్క ఖైదీని చూస్తూ నడుస్తున్నాడతను, జైలు సూపరెన్టెంటు చెప్పే మాటలు వింటూ.

కొంతదూరం పోయాక, హఠాత్తుగా ఆగిపోయాడతను. అతని చూపులు ఒక ఖైదీపై నిలిచిపోయాయి.

దృఢంగా, లావుగా ఉన్నాడా ఖైది. కళ్ళు, ఎర్రగా, క్రూరంగా ఉన్నాయి. అప్పటి వరకు బస్కీలు తీసి ఉండటంవల్ల, ఒళ్ళంతా చెమటతో తడిసిపోయి ఉంది. నల్లగా ఉన్నాడు. దుబ్బుగా ఉంది జుట్టు.

తన ముందాగి, తన కళ్ళల్లోకి చూస్తున్న మిలటరీవాని కళ్ళల్లోకి సూటిగా చూశాడా ఖైది.

"నీ పేరు?" మిలటరీ వ్యక్తి ప్రశ్నించాడు మెల్లగా.

"రాజన్." ఉరిమినట్లుందా ఖైదీ స్వరం.

"తమిళియన్?"

అవునన్నట్లు తల ఊపాడు ఖైదీ. మిలటరీ వ్యక్తి తన వెనక నడుస్తున్న జైలు సూపరింటెంటు వైపు చూశాడు.

"రాజన్! వెళ్ళి ఆఫీసు గదిలో కూర్చో నీతో పనుంది" అన్నాడు సూపరింటెంటు.

"ఏమిటో అది తెల్సుకోవచ్చా?"

"ముందు పద. తరవాత తెలుస్తుంది!" ముందుకి కదిలారు యిద్దరు. రాజన్ వెళ్ళిపోతున్న వారివైపు చూసి తలెగరేశాడు. ఆఫీసు వైపు నడుస్తున్న రాజన్ని అంతా కుతూహలంతో చూడసాగారు.

మిలటరీ వ్యక్తి మరికొంతమంది ఖైదీలను చూసుకుంటూ పోయి, మరో ఖైదీ దగ్గర ఆగాడు.

ఆ ఖైదీ వయస్సు దాదాపు నలభై సంవత్సరాలుంటాయి ఎర్రగా, బలంగా ఉన్నాడు. కళ్ళు అమాయకంగా ఉండి, అతన్ని చూస్తే క్రూరమైన మనస్సుగలవాడని ఎవరూ అనుకోలేరు. మంచి పర్సనాలిటీ. అయిదున్నర అడుగుల ఎత్తుంటాడు.

"నీ పేరు?" ప్రశ్నించాడు మిలటరీ వ్యక్తి.

"జానీ!" పెడసరంగా జవాబిచ్చాడు అతను. నవ్వాడు మిలటరీ వ్యక్తి. నవ్వి, సూపరింటెంటు వైపు తిరిగి చూశాడు.

జానీ కూడా ఆఫీసులోకి నడిచాడు.

అదేవిధంగా ఖైదీలనందరినీ పరీక్షించి మరో ఇద్దర్ని ఎన్నిక చేశాడు మిలటరీ వ్యక్తి. ఆ ఖైదీల పేర్లు రతన్, సులేమాన్లు. వారిద్దరు చూడటానికి అంత దృఢంగా

కన్పించరు. సామాన్యంగా కన్పించినా విపరీతమయిన బలం ఉంది వాళ్ళ ఒంట్లో. తెలివితేటలు కూడా అధికం. తోడు దొంగలు. రెండు, మూడు మార్లు జైలునుంచి పారి పోవటానికి ప్రయత్నించి పట్టుబడి ఎన్నో హింసల ననుభ వించారు.

నలుగురు ఆఫీసులో బల్లమీద కూర్చొని మిలటరీ వ్యక్తి రాకకై ఎదురు చూస్తున్నారు.

పదినిమిషాల తరవాత ప్రవేశించాడతను. వస్తూనే, "గుడ్ మార్నింగ్. నా పేరు రవిశంకర్. కెప్టెన్ రవి శంకర్!" అన్నాడు నవ్వుతూ.

ఖైదీలు నలుగురు మాట్లాడలేదు. కనీసం నవ్వనయినా లేదు. "మీలో మీకు తెలుసు. అయినా మరోమారు పరి చయం చేస్తాను!" అని ఖైదీలను ఒకరి కొకరు పరిచయం చేశాడు రవిశంకర్. పరిచయాలయ్యాక నలుగురూ కెప్టెన్ రవిశంకర్ వంక కుతూహలంగా చూస్తూ కూర్చున్నారు.

రవిశంకర్ చెప్పటం ప్రారంభించాడు.

"ఫ్రెండ్స్! మీరంతా నేరాలు చేసి శిక్ష అనుభ విస్తున్న వాళ్ళని నాకు తెలుసు. అవకాశం వస్తే మీలో చాలా మంది నేరాలు చేయటం మానివేసి నూతన జీవితం గడపటానికి సిద్ధంగా ఉన్నారు. ఇప్పుడు మీరు మాతో సహకరిస్తే మీ జైలుశిక్ష రద్దు చేస్తుంది ప్రభుత్వం. అంతే గాదు, సర్వ సౌభాగ్యాలతో జీవించటానికి ఏర్పాట్లు చేస్తుంది."

ఆగాడు రవిశంకర్. చెవులప్పగించి వింటున్నారు నలు గురు. "ఇక సూటిగా విషయం చెబుతాను వినండి. ప్రస్తుతం మన దేశానికొక పెద్ద ప్రమాదం వొచ్చిపడింది. దానిని తొలగించటానికి మనమంతా పూనుకోవాలి. మీ

సందేహాలు నాకు తెల్సు. సి. బి. ఐ. ఏజంట్లు, సి. ఐ.డి.లు ఎన్నో వందలమంది ఈ విషయంలో నియమించబడ్డారు. కాని విచిత్రంగా అందరూ మాయమయిపోయారు. బహుశా ఏజంట్ల వివరాలను శత్రువులు తెల్సుకున్నారని ప్రభుత్వం భావిస్తోంది."

ఆగి, జేబులోనుంచి సిగరెట్ తీసుకుని ముట్టించుకున్నాడు రవిశంకర్.

"మేమేం చేయాలి?" సులేమాన్ అన్నాడు చిన్నగా.

"అదే చెప్పబోతున్నాను." ఒకదమ్ము పీల్చి చెప్పటం ప్రారంభించాడు కెప్టెన్.

"మీరు నేరస్తులయినా ధైర్యం, చొరవ, సాహసం గలవాళ్ళు. అవకాశం వస్తే కొండలనయినా పిండి చేయగలవాళ్లు. మీ అందరి గురించి సర్వస్వం తెలుసుకున్నాను. ఇప్పుడు మీ శక్తిని, నిజాయితీని నిరూపించుకునే అవకాశం వచ్చింది. ఈ జైలు జీవితం నుంచి బయట పడొచ్చు."

"ఏం చేయాలో_చెప్పండి!" విసుగ్గా అన్నాడు జాని. అతని వంక చూశాడు రవిశంకర్. "నేనిది ఊరికే చెప్పటం లేదు మిస్టర్ జానీ. మీకు వచ్చిన అవకాశం గురించి వివరిస్తున్నాను. మీరు నలుగురు నాకు సహకరించాలి. మనం అయిదుగురం శత్రుస్థావరాన్ని ధ్వంసం చేయాలి."

"ఎక్కడుంది?" ఆత్రంగా ప్రశ్నించాడు సులేమాన్.

"ఆ వివరాలు తరువాత చెబుతాను. ముందు నాకు ప్రామిస్ చేయాలి. నేను మీకు నాయకుడిగా వ్యవహరిస్తాను. నా ఆజ్ఞలు తు. చ. తప్పకుండా ఆచరించి తీరాలి. మీరు సాయం చేస్తే ఆ స్థావరాన్ని నాశనం చేయటం అసాధ్యమేమీకాదు."

రెండు నిమిషాలు నిశ్శబ్దం అలుముకుంది.

"ఆల్ రైట్! మీ షరతులన్నిటికీ అంగీకరిస్తున్నాం!" అన్నాడు రతన్.

"ఇక్కడ షరతులంటూ ఏమీ లేవు. మనం అంతా ఒకటే. ఒకరినొకరు సహకరించుకోవాలి. అవసరమయితే ప్రాణాలుకూడా అర్పించాలి. రంగంలోకి దిగిన తర్వాత వెనుకంజ వేయకూడదు. ఎవ్వరూ తప్పించుకోవటానికి ప్రయత్నించకూడదు. ఈ ఆపరేషన్‌లో పాల్గొనటం యిష్టంలేకపోతే యిప్పుడే మానుకోవచ్చు. బలవంతం మేమీ లేదు."

అందరూ తలలూపారు.

కెప్టెన్ రవిశంకర్ వారితో ఏమేమి చేయాలో వివరించ నారంభించాడు.

## 2

దట్టమయిన అడవిలోగుండా పోతూంది ట్రక్కు. సులేమాన్ డ్రైవింగ్‌లో దిట్ట అవటంవల్ల అతనే ట్రక్కుని నడుపుతున్నాడు. పెద్ద పెద్ద చెట్లు, పొదల మధ్యగుండా అతి చాకచక్యంగా నడుపుతున్నాడు ట్రక్‌ని. ఇప్పుడతను మిలటరీ దుస్తులలో వున్నాడు. మిగిలినవారు కూడా అదే డ్రస్‌లో వున్నారు. ట్రక్ లోపల జానీ, రతన్, రాజన్‌లు కూర్చొని వున్నారు. కెప్టెన్ రవిశంకర్ సులేమాన్ ప్రక్క కూర్చొని దారిని చూపుతున్నాడు. ట్రక్ కుదుపులకు అంతా ఎగిరెగిరి పడుతున్నారు. దారి అంతా సరిగ్గా లేక ఎత్తుపల్లాలుగా వుంది. అక్కడక్కడ బురదగా వుంది.

ఉన్నట్లుండి ట్రక్ ఆగిపోయింది.

తమకు, డ్రైవర్‌కు మధ్యనున్న చిన్న చెక్క తలుపు ప్రక్కకులాగి ఏమయిందని ప్రశ్నించాడు రతన్.

"వెనకచక్రం బురదలో ఇరుక్కు పోయింది. దిగి తోయాలి!" జవాబిచ్చాడు కెప్టెన్ రవిశంకర్.

రాజన్, జానీ, రతన్‌లు క్రిందకుదిగారు. చుట్టూ అడవి దట్టంగా అల్లుకుపోయి ఉంది. సూర్యకాంతి సరిగ్గా కన్పించటం లేదు. ట్రక్ హెడ్‌లైట్స్ వెలుగుతున్నాయి.

"ఇంతకంటె మంచి మార్గంలేదా?" రాజన్ ప్రశ్నించాడు రవిశంకర్‌ని.

"ఉంది. అయితే ఇదే మనకు అనువయిన రూటు, మనం అక్కడికి వెళుతున్నట్లు ఎవరికీ తెలియకుండా ఉంటుందని యిటువైపు వచ్చాము."

నేలంతా బురదగా వుంది. అడుగుతీసి, అడుగువేస్తే జారిపోతూంది. అయిదుగురి కాళ్ళకు దళసరి బూట్లుండటం వల్ల కాళ్ళకు బురదకాలేదు. ట్రక్ ఎడమవయిపు వెనక చక్రాలు బురదలో కూరుకు పోయాయి. నలుగురూ ట్రక్‌ని బురదలోంచి బయటకు లాగటానికి ప్రయత్నించారు చక్రాలు తిరిగేకొంది మరింత లోతుకు పోతున్నాయి వెనక యిరుక్కుపోయిన చక్రాలు.

అరగంట కష్టపడి, అతిప్రయత్నం మీద ట్రక్‌ని బయటకు లాగ గలిగారు అయిదుగురు కల్సి. తిరిగి బయలుదేరారు. కెప్టెన్ రవిశంకర్ వాచ్ చూసుకున్నాడు. సాయంత్రం మూడుగంటలు దాటింది.

"మరో రెండు గంటల్లో చేరుకుంటాం!" అన్నాడు సులేమాన్‌తో.

తిరిగి బయలుదేరింది ట్రక్. అందరూ మౌనంగా వుండిపోయారు ఆలోచిస్తూ.

మధ్యలో రెండు, మూడు జంతువుల్ని వేటాడాడు రతన్.

సాయం సమయానికి సముద్ర తీరం చేరుకున్నారు. అడవి అంతమయిపోయి, అంతా సరివి చెట్లుతో దట్టంగా వుంది.

ఆ సరివిచెట్లమధ్య ఖాళీగా వున్న చోట ట్రక్ ఆపాడు సులేమాన్. క్రిందకు దిగారు అంతా. చెట్ల గుండా సముద్రం కన్పిస్తోంది. చకచక టెంట్ వేశారు, రెండు చెట్లునరికి, చదును చేసి. నాలుగుసరివి చెట్లను కలిపి, అడ్డంగా సరివి కొమ్మల్ని, మానుల్ని కట్టి చిన్న మంచెలాగా తయారు చేశారు.

ఈ లోపు రవిశంకర్ టీ కాచాడు. అయిదుగురూ త్రాగారు. చీకటి పడుతుండగా పాక్ చేసిన ఫుడ్ పాకెట్స్ ఇచ్చాడు రవిశంకర్. వాటిని తిన్నారు అయిదు గురు.

"ఈ రాత్రికి విశ్రాంతి తీసుకోండి. గుడ్ నైట్. కాప లాగా నా డ్యూటి రెండు గంటలకు. అప్పుడు లేపండి! గుడ్ నైట్!" అని చెప్పి గుడారంలోకి నడిచాడు రవి శంకర్.

# 3

రాత్రి పదిగంటలు దాటింది.

పౌర్ణమి రోజులు కావటంవల్ల వెన్నెల పిండారబోసి నట్లుంది. వాతావరణం నిశ్శబ్దంగా వుండి, భయం గొలుపు తూంది. సముద్రపు హోరు విన్పిస్తూంది స్పష్టంగా.

అంతవరకు రైఫిల్ పట్టుకొని కాపలా కాస్తూ కూర్చున్న రాజన్ లేచి, ఆవలించాడు. ఒకసారి ఒళ్ళు విరుచుకొని, జేబులోంచి సిగరెట్ పాకెట్ తీసి, సిగరెట్టు వెలిగించు కున్నాడు. గట్టిగా రెండు పీల్పులుపీల్చగానే శరీరంలోకి హుషారు వచ్చినట్లనిపించింది.

సముద్ర తీరంలో, ఇసుకలో నడవాలనిపించింది. టెంట్‌లోకి తొంగి చూశాడు. చిన్న కొవ్వొత్తి వెలుగు తూంది. కెప్టెన్ రవిశంకర్ గాఢ నిద్రలో ఉన్నట్లు ఉచ్ఛ్వాస, నిశ్వాసాలు వినిపిస్తున్నాయి. ట్రక్‌లో మిగిలిన ముగ్గురూ నిద్రపోతున్నారు.

సరివి తోపు దాటి ఇసుకలోకి నడిచాడు. కొంతదూరం నడవగానే తన వెనక ఎవరో నడుస్తున్నట్లు శబ్దం అయి, చటుక్కున వెనుదిరిగాడు, రైఫిల్ పొజిషన్‌లో పట్టుకొని.

"రాజన్! నేను రతన్‌ని!"

దీర్ఘంగా నిశ్వాస వదలి, రైఫిల్‌ని క్రిందకు దించాడు రాజన్. ఆగిపోయిన రతన్ ముందుకు నడిచి రాజన్‌ని కలిశాడు. ఇద్దరు మౌనంగా కొంతదూరం నడిచారు ఇసుకలో. రాజన్‌ని అడిగి సిగరెట్ తీసుకున్నాడు రతన్.

"పైకి మంచిగా కన్పిస్తున్నా రవిశంకర్ చాలా దుర్మార్గుడు" ఉపోద్ఘాతంగా అన్నాడు రతన్ పొగవదిలి.

"నీకెలా తెల్సు?"

ఇద్దరు ఇసుకలో సముద్రానికి అభిముఖంగా కూర్చున్నారు. రాజన్ మెళ్ళో పవర్‌ఫుల్ బైనాక్యులర్స్ వేలాడుతూంది. కూర్చొని దానిని ముందుకు లాక్కుని సముద్రాన్ని దిగంతాల వరకు పరిశీలించి చూశాడు.

"ఆర్మీలో నా ఫ్రెండ్ ఒకడు వున్నాడు. అతడు చెప్పాడు. రవిశంకర్ దురాగతాలన్నీ కథలుగా చెప్పేవాడు సెలవలకి వచ్చినపుడు."

రాజన్ నవ్వాడు రతన్ వంక చూసి.

"నీ స్నేహితుడు చెప్పే కథలు వినేంత తీరికగా ఉన్నావా?"

"అయితే నేను చెప్పేది అబద్ధమంటావా?" చిన్నబుచ్చుకొని అన్నాడు రతన్.

"ఛ...ఛ. అలా ఎందుకంటాను నేను? మిలటరీలో స్ట్రిక్ట్‌గా వుంటారు. డిసిప్లిన్ మెయిన్ టెయిన్ చేస్తుంటారు. కెప్టెన్ రవిశంకర్ మరీ స్ట్రిక్ట్ మనిషి అయ్యుంటాడు. అతని ప్రవర్తన నచ్చని నీ స్నేహితుడు అతన్ని గురించి నీతో చెడుగా చెప్పి వుండవచ్చు."

రతన్ మాట్లాడ లేదు.

"అయినా కెప్టెన్ ఎటువంటి వాడయితే మనకెందుకు? నేరాలు చేసి, శిక్షలు అనుభవించి, నా మనస్సు, శరీరం అలిసిపోయింది. మంచిగా బ్రతుకుదామనుకున్నాను. కాని ఓ హత్య చేయటం తప్పనిసరి అయింది. తీసుకువెళ్ళి ఆ జైలులో పారేశారు. ఇన్నాళ్ళకి అవకాశం కల్సివచ్చింది. ఇకనయినా జీవితాన్ని ప్రశాంతంగా, ఏ ఒడిదుడుకులు లేకుండా గడపాలని వుంది."

రాజన్ మాటల్లో ఎంతో ఆవేదన ధ్వనించింది రతన్‌కి.

"ఆపరేషన్ అయిపోయాక కెప్టెన్ మనల్ని ఒదులుతాడా?" సందేహిస్తూనే అడిగాడు రతన్.

రాజన్, రతన్ వంక తిరిగాడు. "రతన్! నిజం చెప్పు. నువ్వీ ఆపరేషన్‌లో మనస్ఫూర్తిగా పాల్గొంటున్నావా?" సూటిగా అడిగాడు.

రతన్ సమాధానం యివ్వలేదు.

"నీ వాలకం చూస్తుంటే బలవంతంగా ఈ పనికి ఒప్పుకుంటున్నట్లు అన్పిస్తుంది నాకు. కెప్టెన్ ముందే చెప్పేడు. బలవంతం ఏమీ లేదని."

"నిజంగానే నాకు యిష్టంలేదు. కాని ఒచ్చిన అవ

కాశాన్ని వదులుకోలేను. ఆ జైలునుంచి బయటపడటం అసాధ్యం. అందుకే ఒప్పుకున్నట్లు నటించి, తప్పించుకోవ టానికి ప్రయత్నిస్తున్నాను.'' చెప్పాడు రతన్.

''మరి యింతకాలం ఏం చేశావ్? దాదాపు రెండు నెలలు మనకి అన్ని విషయాలలో ట్రెయినింగ్ యిచ్చారు గదా! అప్పుడు తప్పించుకోలేకపోయావా?'' వ్యంగ్యంగా అన్నాడు రాజన్.

''అవును. తప్పించుకుందామనే అనుకున్నాను. కాని అనుక్షణం కెప్టెన్ కళ్ళు నామీదే ఉండేవి. నేనేం చేస్తున్నా, ఎక్కడున్నా గమనించేవాడు. ఆయన నన్ను అనుమానించాడు.''

''ఇప్పుడు మాత్రం ఎలా తప్పించుకుంటావ్?''

రతన్ జవాబు యివ్వలేదు. నోరుతెరిచి ఏదో చెప్ప బోయాడు. ఆ క్షణంలో వెనక ఎవ్వరో ఉన్నట్లనిపించి తల త్రిప్పి చూశాడు. రతన్ ఏదో చెప్పబోయి, ఆగి పోవటం, తలత్రిప్పి వెనక్కు చూడటం గమనించి రాజన్ కూడా తల వెనక్కి తిప్పాడు.

కొద్దిదూరంలో కెప్టెన్ రవిశంకర్ నిలబడి వున్నాడు. ఆయన్ని చూడగానే రతన్ తల వాలిపోయింది.

''మిస్టర్ రతన్! నేనెప్పుడో చెప్పాను. ఎవ్వరూ బలవంతంమీద ఒప్పుకోవద్దని. ఆల్ రైట్ నిన్ను ఫ్రీగా వదిలేస్తాను. రేపే వెళ్ళిపోవచ్చు.'' గిరుక్కున వెనుదిరిగి వెళ్ళిపోయాడాయన.

''కెప్టెన్‌కి కోపం వొచ్చినట్లుంది. ఒకవేళ మన మాటలు వినలేదు గదా?'' రాజన్ అన్నాడు టెంట్ వైపు నడుస్తూ.

రతన్ తలవంచుకుని అతన్ని అనుసరించాడు.

# 4

ఉదయం ఆరు గంటలయింది.

రాజన్ టీ కాచి యిచ్చాడు అందరికి. తాగుతూ చెప్ప సాగాడు కెప్టెన్ రవిశంకర్.

"ఫ్రెండ్స్! మనం మనదేశానికి వాటిల్లబోయే ప్రమాదాన్ని నివారించడానికి బయలుదేరాం. ఈ ఆపరేషన్‌లో మన ప్రాణాలు పోవచ్చు. కాని మన ధ్యేయం ఒక్కటే. ఎలాగయినా శత్రువుని నాశనం చేయాలి.

మనలో కొందరికి ఇందులో పాల్గొనటం యిష్టం లేనట్లుంది. వారిని యిప్పుడే పంపించివేస్తాను. మీరందరూ వెళ్ళినాసరే, చివరకు నేనొక్కణ్ణి అయినా ఒంటరిగా ఈ కార్యం నిర్వహించటానికి ప్రయత్నిస్తాను," ఆగి రతన్ ముఖంలోకి చూశాడు.

"యస్ సర్! మేమంతా మనస్ఫూర్తిగా ఇందులో పాల్గొంటున్నాం. మా ప్రాణాలు సైతం ధారపోయడానికి సిద్ధంగా వున్నాము." అన్నాడు రతన్.

చిరునవ్వు నవ్వాడు కెప్టెన్ రవిశంకర్.

"గుడ్! ఈ క్షణంనుంచి మనం పాత విషయాలను మరిచిపోదాం. ఇక మరోసారి వివరాలు చెబుతాను. జాగ్రత్తగా వినండి!"

ఆగి, అందరివంక ఓమారు చూసి చెప్పటం ప్రారంభించాడు కెప్టెన్ రవిశంకర్.

"సుమారు మూడు నెలల క్రితం ఇండియాయొక్క స్పెషల్ బ్రాంచ్ ఏజంట్లు, ఇతర ముఖ్య అధికార్లు అందరూ విచిత్రంగా మాయం అయిపోయారు. కొంతమంది మరణించారుకూడా. ఇది గ్రహించి భారతప్రభుత్వం కలవరపడింది. బ్రాంచి ఏజంట్ల మరణాల, అంతర్ధానాల

వెనకనున్న విషయాలు తెలుసుకోవటానికి ప్రయత్నించింది. కాని చిన్న క్లూ కూడా దొరకలేదు.

మన రక్షణ విషయాలకు సంబంధించిన అధికార్లుకూడా కొంతమంది మాయం అయ్యారు. ఈ విషయం చాలా కొద్దిమందికే తెలుసు. వారి విషయంకూడా తెలియ రాలేదు.

ఇది ఇలా వుండగా హిందూ మహాసముద్రంలో అగ్ర రాజ్యాల నౌకల సంచలనం ఎక్కువయింది. ఎవరికివారే తమ నౌకాబలాలను ఈ ప్రాంతంలో వృద్ధిచేసుకో నారంభించారు. అనేక దేశాలకు సంబంధించిన నౌకలు ఆ జలాలలో తారసపడటం ప్రభుత్వం గమనించింది.

మనదేశం మొదటినుండి శాంతికి, అహింసకు దీక్షా కంకణం పూనింది. ఏవిధమైన యుద్ధాలు, కలతలూ లేకుండా ప్రపంచ ప్రజలంతా ప్రశాంతంగా, తృప్తిగా జీవించాలనే వాంఛిస్తోంది. కాని అంతమాత్రాన చేతులు ముడుచుకొని కూర్చోదు.

దాదాపు రెండునెలల క్రితం మద్రాసుకు సమీపంలో గుర్తు తెలియని యుద్ధనౌక ఒకటి సంచరించటం మన తీర ప్రాంతపు గస్తీదళాలు తెలుసుకొని భారతప్రభుత్వానికి తెలిపాయి. అయితే మరుక్షణంలోనే అవి నాశనం అయ్యాయి.

అయితే ఆ నౌక ఏ దేశానికి సంబంధించినదో తెలియ రాలేదు. దానిని ట్రేస్ చేయడానికి రకరకాలుగా ప్రయత్నించారు మనవాళ్ళు. అది ఏమయిందోకూడా తెలియ రాలేదు.

ఇలా వుండగా మరలా ఆ నౌక ప్రత్యక్షమయిందని వార్త తెలిసింది ప్రభుత్వానికి.

అయితే ఆ విషయం తనకు తెల్సిందని బయట పడనివ్వ లేదు మన ప్రభుత్వం. అయితే ఇది అలుసుగా తీసుకొని ఆ నౌక సముద్రంలోనుంచే మిస్సైలీలను ప్రయోగించి భారతదేశానికి చెందిన కొన్ని నౌకలను నాశనం చేసింది.

ఇంతవరకు సహించి ఊరుకుంది మన ప్రభుత్వం. శత్రువుకి తగిన పాఠాలు చెప్పాలనుకుంది. అయితే దేశంలోని ఏజంట్లందరూ మాయం అయిపోయారు. అందువల్ల దానిని నాశనంచేసే బాధ్యత నాపై వుంచింది. నేను సహాయంగా మిమ్మల్ని తెచ్చుకున్నాను. అందువల్లే మీకు ట్రైనింగ్ అంతా యివ్వబడింది. మీరంతా సీక్రెట్ బ్రాంచ్ ఏజంట్ల వలె సుశిక్షితులు, తెలివితేటలు గలవాళ్ళు కాకపోవచ్చు. కాని మీ ధైర్యాన్ని, సమయస్ఫూర్తిని వినియోగించండి. మనదేశానికి వాటిల్లబోతున్న ఆపదని వారించండి."

సుదీర్ఘమైన తన ఉపన్యాసంని ఆపాడు రవిశంకర్. అతని మాటలతో నల్గురిలో ఆవేశం, ఉత్సాహం వచ్చింది. "ఏమి చేయాలో చెప్పండి?" అన్నాడు జానీ ఉద్రేకంగా.

కెప్టెన్ రవిశంకర్ వివరించటం ప్రారంభించాడు: "రెండు, మూడు రోజులలో ఆ వార్‌షిప్ తిరిగి మన జలాలలో ప్రవేశించవచ్చు. రెండు, మూడు రోజులన్నది ఉజ్జాయింపు మాత్రమే. అసలది ఎప్పుడు వస్తుందో ఎవరికీ తెలియదు. ఎన్నాళ్ళయినా దానికోసం వెయిట్ చేయాలి. అది కన్పించగానే మనం అయిదుగురం దానిని సమీపిస్తాం. వీలుంటే పట్టుకుందాం, లేదా నాశనం చేద్దాం."

"చిన్న సందేహం!" అన్నాడు సులేమాన్. ఏమిటన్నట్లు అతనివయిపు చూశాడు కెప్టెన్ రవిశంకర్.

"అంతర్ధానమయిన ఏజంట్లందరు ఆ స్టీమర్‌లోనే వుంటారని భావిస్తున్నారా?"

"నా ఉద్దేశ్యం దానిలో ఉండకపోవచ్చని. శత్రు దేశానికి సంబంధించిన ముఠా ఒకటి మనదేశంలో పని చేస్తుంది. దానిని అణచివేయడానికి అనేక చర్యలు తీసుకుంటున్నారు. ఆ ముఠాకి, ఈ షిప్‌కు సంబంధం వుండొచ్చు, ఉండకపోవచ్చు. ఒకవేళ సంబంధం వుందని అనుకున్నా, అనుక్షణం తప్పించుకోచూసే మన ఏజంట్లని ఇక్కడినుండి తరలించి రిస్క్ తీసుకోవడంలో అర్థం వుండదు. బహుశా ఆ ముఠా స్థావరాలలోనే ఎక్కడో బంధింపబడి వుంటారని నా ఊహ."

సందేహం తీరినట్లు తలాడించాడు సులేమాన్. తిరిగి చెప్పటం ప్రారంభించాడు రవిశంకర్.

"ఇన్నాళ్ళుగా మీకు అందుకే చెబుతూ వస్తున్నాను. శత్రువులు మీకు ఆశ పెట్టవచ్చు. కోరినంత బంగారం, డబ్బు, ఏదడిగినా యిస్తామని ప్రలోభ పెట్టవచ్చు. అందుకే మొదటినుండి హెచ్చరిస్తున్నాను. దేనికీ లొంగకండి. మన ధ్యేయం ఒక్కటే. దేశద్రోహులు కావొద్దు!"

చెప్పటం ముగించి అందరి ముఖాలలోకి పరీక్షగా చూశాడు కెప్టెన్ రవిశంకర్. అందరూ తమలో తామే ఆలోచించుకుంటున్నారు.

చివరికి అన్నాడు సులేమాన్. "ఓ. కె. కెప్టెన్! ఈ ఆపరేషన్‌నుంచి నేను తప్పుకుంటున్నాను."

అందరు అదిరిపడి సులేమాన్ వంక చూశారు. రవి శంకర్ నమ్మలేనట్లు ముఖం పెట్టాడు.

"యస్ కెప్టెన్! మధువు, మగువకి నా మనస్సు లొంగకుండా వుండలేదు. వాటిని చూస్తేనే నా కళ్ళు చెదిరి

పోతాయి. ఎంత నిగ్రహించుకుందామనన్నా అదుపులో వుంచుకోలేను. అందుకే తప్పుకోవాలనుకుంటున్నాను" స్థిరంగా అన్నాడు సులేమాన్.

కెప్టెన్ రవిశంకర్, సులేమాన్ ముఖంలోకి చూశాడు సూటిగా. అతని కళ్ళల్లో ఏభావం లేదు.

"ఆల్ రైట్! ఇంకా ఎవరయినా వెళతారా?" మిగిలిన వారివైపు తిరిగి అన్నాడు. ఎవ్వరూ మాట్లాడలేదు. తిరిగి సులేమాన్ వంక చూశాడు కెప్టెన్ రవిశంకర్.

"ఆల్ రైట్ సులేమాన్! నీ మనస్సులో భావాన్ని బయట పెట్టినందుకు సంతోషం. నువ్వేం కోరినా ఇవ్వమని వ్రాసియిస్తాను. దాన్ని మీ జైలు సూపర్నెంటుకు చూపించు. మిగిలిన పని అతడే చూస్తాడు."

రవిశంకర్ గబ గబ టెంట్ లోకి నడిచి, కాగితాలు ముందేసుకుని, గబ గబ రాసి యిచ్చాడు. దాన్ని ఓ కవరులో పెట్టి సీలు వేసి, సులేమాన్ కు యిచ్చాడు.

"కెప్టెన్! నా రివాల్వర్, బైనాక్యులర్స్ తీసుకుపోవచ్చా?" సులేమాన్ అడిగాడు రవిశంకర్ ని.

"వాటితో పని ఉండదనుకుంటాను."

"ప్రాణరక్షణకయినా కావాలిగా!"

రవిశంకర్ అంగీకరించాడు. మరుక్షణమే తన సామాను అంతా తీసుకుని బయలుదేరాడు. రవిశంకర్ అతనికి వెళ్ళటానికి సులభమయిన మార్గం చెప్పాడు. వడి వడిగా నడిచాడు సులేమాన్.

## 5

మరో రెండు రోజులు గడిచాయి.

ఈ రెండు రోజులు వారి కార్యక్రమం ఒకటే. ఉదయాన్నే లేవటం, కాఫీ తాగటం, బైనాక్యులర్స్ తో

యిద్దరు సముద్రం వైపు చూస్తూ కూర్చోవటం; మిగిలిన యిద్దరు యితర పనులు చూడటం జరిగింది.

మూడో రోజు ఉదయం ఆరు గంట లవుతోంది. సూర్యుడు సముద్రంలోంచి లేస్తున్నాడు. దాని ప్రతి బింబం పెద్దదిగా వుండి ఎంతో మనోహరంగా వుంది. సూర్యకాంతి సముద్రపు జలాలపై ప్రసరించి బంగారు కాంతిని వెదజల్లుతోంది.

కెప్టెన్ రవిశంకర్ అప్పటికే లేచి కాలకృత్యాలు తీర్చుకొని మంచెమీద కూర్చొని బైనాక్యులర్స్‌తో చూస్తున్నాడు. ఏమాత్రం విసుగు పుట్టడం లేదతనికి. రతన్ కూడా అతని ప్రక్కనే కూర్చొని బైనాక్యులర్స్ లోంచి చూస్తున్నాడు. చూసి చూసి కళ్ళు నొప్పి పుడుతు న్నాయతనికి. జానీ బ్లాక్ కాఫీ తయారు చేస్తున్నాడు. రాజన్ అడవిలోకి పోయాడు.

"కెప్టెన్!" ఉన్నట్టుండి హఠాత్తుగా అరవటంతో, రతన్ వంక చూశాడు రవిశంకర్.

"ఏదో స్టీమర్ వస్తున్నట్టుంది చూడండి!"

జానీ వాళ్ళిద్దరి వయిపు ఒకమారు చూసి తన పనిలో నిమగ్నమైపోయాడు.

రవిశంకర్ తనూ బైనాక్యులర్స్‌లోంచి దృష్టి సారించాడు. ఏమీ కన్పించలేదు. దృష్టిని కాన్‌సన్‌ట్రేట్ చేసి చూడసాగాడు. అయిదు నిముషాల అనంతరం సూర్య బింబం ప్రక్కగా నల్లటి పొగ అస్పష్టంగా కన్పించింది. దాని మీద దృష్టిని నిలిపి, పరీక్షగా చూడసాగాడు కెప్టెన్ రవిశంకర్. మరో పదినిముషాలనంతరం పొగ మాత్రం స్పష్టంగా కన్పించసాగింది.

అయితే అది ఏస్టీమరో తెలియదు. మామూలు పాసింజర్ వెసల్ కావచ్చు. కార్గో సర్వీసు కావచ్చు. అందుకే మౌనంగా చూస్తూండిపోయాడు.

అంతలో రాజన్ తిరిగి వచ్చాడు. విషయం తెల్సుకొని అతనూ మంచె ఎక్కాడు బైనాక్యులర్స్‌తో. జానీ మౌనంగా ముగ్గురికీ బ్లాక్ కాఫీ యిచ్చాడు.

మరో గంట తర్వాత స్టీమర్ కన్పించింది. వెంటనే క్రిందకు దిగాడు రవిశంకర్. వైర్‌లెస్‌లో కాంటాక్టు చేశాడు. ఓసారి ఫార్మాలిటీగా రక్షణ దళం ఆ షిప్‌ని హెచ్చరించబోతున్నట్లు, మిగిలిన కార్యక్రమం అంతా రవిశంకర్ కే వదిలిపెడుతున్నట్లు వార్త వచ్చింది.

ఈలోపుగానే ఏం చేయాలో నిర్ణయించుకున్నాడు కెప్టెన్ రవిశంకర్. మరో గంట తర్వాత షిప్ పూర్తిగా కన్పించింది. దానిమీద ఏవిధమయిన గుర్తులు లేవు. మధ్యాహ్నమయినా అది అక్కడ నుంచి కదలకపోవడంతో అక్కడే 'ఏంకర్' అయిందని రూఢి పరుచుకున్నాడు రవిశంకర్.

ముగ్గుర్ని పిలిచాడు "మన ప్లాన్ మార్చుకోవాల్సి వచ్చింది" అంటూ తన కొత్త ప్లాన్‌ని వివరించాడు. నలుగురి దగ్గర సిగరెట్ పాకెట్ సైజులో వున్న వైర్లెస్ ట్రాన్స్‌మిటర్లున్నాయి. ట్రక్‌ని అడవిలో కన్పించకుండా దాచిపెట్టి, చెట్టు కొమ్మలు, ఆకులు కప్పారు.

నలుగురు జిప్ వున్న స్విమ్మింగ్ డ్రస్ ధరించారు. వాటిపైన ఆక్సిజన్ సిలిండర్స్ తొడుక్కున్నారు వీపున వచ్చేటట్లు. వాటర్ ప్రూఫ్ బాగ్‌లో పవర్‌ఫుల్ ఎక్స్‌ప్లోజివ్స్ లేసుకున్నారు. తలకు రబ్బరు మాస్క్, కళ్ళకు

గ్లాస్ గాగుల్సు, నలుగురి చేతుల్లో అండర్ వాటర్ టార్చెస్ వున్నాయి.

నలుగురు సముద్రం దగ్గరకు చేరగానే మరోమారు హెచ్చరించాడు కెప్టెన్ రవిశంకర్. నలుగురు ఈదడానికి పనికివచ్చే రబ్బరు బూట్లను ధరించారు.

సముద్రంలోకి కొంతదూరంపోయి లోనికి మునిగి స్టీమర్ వైపుగా ఈదుకుంటూ పోసాగారు. రవిశంకర్ తన చేతిలో వున్న కంపాస్‌ని చూసి డైరెక్షన్స్ యిస్తు న్నాడు. నలుగురూ నిశ్శబ్దంగా అండర్ వాటర్‌లో ఈదు కుంటూ, చేపపిల్లల్లా తేలుకుంటూ, స్టీమర్ దిక్కుగా పోసాగారు.

# 6

సముద్ర జలాలపై నిశ్చలంగా నిలబడి వుందా స్టీమర్. ఆధునిక యుద్ధనౌక కావటంవల్ల రకరకాల ఆయుధాలు అమర్చబడి వున్నాయి. నౌకలోని లైట్లు దేదీప్యమానంగా వెలుగుతున్నాయి.

కెప్టెన్ రవిశంకర్ తన సహచరులతో దాని దగ్గరకు చేరుకునేటప్పటికి సాయంత్రం ఆరు గంటలు దాటింది.

విపరీతంగా ఈదడంవల్ల అలసిపోయారు నలుగురు. అయినప్పటికి చేయబోయే కార్యం ఉత్సాహాన్నిస్తుంది. సముద్రంలో కూడా ప్రమాదమైన జంతువులు కాని, వృక్షాలు కాని లేనందువల్ల వారి ప్రయాణాని కేమి ఆటంకం కలగలేదు.

నీటిలో సాధ్యమైనంత లోతులో మునిగి ప్రయాణిం చారు. నౌక యింకా ఏడెనిమిది వందల గజాల దూరంలో ఉండనగా కెప్టెన్ నెమ్మదిగా పైకి తేలి చూశాడు.

అది అవటానికి వార్‌షిప్ అయినా, రెండంతస్థులుగా వుంది. రెండు అంతస్థుల్లోనూ లైట్లు వెలుగుతున్నాయి. డెక్ మీద ఫిరంగులు మొదలయిన ఆయుధాలు కన్పిస్తున్నాయి అస్పష్టంగా. బహుశా రెండో అంతస్థు సిబ్బంది నివాసం కావచ్చని ఊహించాడు రవిశంకర్.

రెండు నిముషాలపాటు పరిశీలించినా డెక్ మీద కదలిక కన్పించలేదు. అంతలోనే రెండు ఆకారాలు గన్స్ పట్టుకొని రావటం గమనించి లోనికి ఈదుకుంటూ పోయాడు.

లోపల అనుచరులంతా అతని ఆజ్ఞల కోసం ఎదురు చూస్తున్నారు. పూర్తిగా చీకటి పడటంవల్ల లోపల కన్పించటం లేదు. కెప్టెన్ రవిశంకర్ టార్చ్‌ని సహచరుల వైపు త్రిప్పి ఒకసారి వెలిగించి ఆర్పేశాడు.

అతని సంజ్ఞని గమనించి ముగ్గురూ అతన్ని అనుసరించారు. నలుగురు నౌక అంచుకి చేరుకున్నారు. పైకి తేలారు. ఇప్పుడు వారు సరిగ్గా నౌక ప్రక్కనే అంచుకి ఆనుకొని ఉన్నారు. గాగుల్స్ తీసుకున్నారు.

"రతన్, జానీ, రాజన్!" పిల్చాడు నెమ్మదిగా రవిశంకర్.

"యస్ సర్!" సమాధానం యిచ్చారు వారు.

"నేనూ, రతన్ ఈ వైపున బాంబులు అమరుస్తాం. జానీ, రాజన్‌లు అవతలి ప్రక్క అమర్చండి. సరిగ్గా నలభై ఎనిమిది గంటల తర్వాత పేలాలి, జాగ్రత్త! క్విక్!" గాగుల్స్ తగిలించుకొని లోనికి మునిగాడు.

రతన్ కూడా రవిశంకర్‌తోపాటే నీటిలో మునిగాడు. జానీ, రాజన్‌లు పైకి తేలుతూనే నెమ్మదిగా అంచువెంట రెండో ప్రక్కకు శబ్దం కాకుండా చేరుకున్నారు.

నీటిలో మునిగిన కెప్టెన్ రవిశంకర్; రతన్‌లు వాటర్ ప్రూఫ్ బ్యాగ్‌లో అమర్చబడిన బాంబులను నౌక ఇనుప గోడకి అంటించారు. వాటికి శక్తివంతమయిన మాగ్నెట్ అమర్చబడి ఉంది. దాని సాయంతో అది నౌకకు అతుక్కుపోయింది. టార్చి వెలుగులో బాంబులను 48 గంటలకు పేలేటట్లు అరేంజ్ చేశాడు. ఆ బాంబులన్నిటిని గజానికి మూడు చొప్పున అమర్చాడు. పావుగంటలో ఇద్దరు కలిసి అరేంజ్ చేయటం పూర్తయింది. మరో అయిదు నిమిషాల తర్వాత జానీ, రాజన్‌లు వచ్చి వెలిశారు.

"గుడ్! వచ్చిన పని ఇంత సులభంగా నెరవేరుతుందనుకోలేదు. పదండి!" అన్నాడానందంగా కెప్టెన్ రవిశంకర్.

అదే సమయంలో నౌక పైభాగాన సైరన్ మోగింది. క్షణాలలో శక్తివంతమయిన సెర్చ్‌లైట్లు నౌక చుట్టూ సముద్రం మీదకు ప్రసరించాయి. అంతా పట్టపగలులా తయారయింది. ఏం జరిగిందో అర్థం కాలేదు వారికి. అప్పుడే మైక్‌లో విన్పించింది.

"మిస్టర్! మీ చర్యలన్నిటిని కనిపెడుతున్నాం. మర్యాదగా లొంగిపొండి."

కెప్టెన్ రవిశంకర్‌తోపాటు మిగిలిన ముగ్గురు ప్రాణ్పడిపోయారు.

# 7

పైనుంచి బిల బిలమంటూ సముద్రంలోకి దూకారు కొంతమంది. అందరూ స్విమ్మింగ్ డ్రస్‌లోనే వున్నారు. ఎడమ చేతిలో టార్చి, కుడి చేతిలో తుపాకిలా వుంది. ఆ తుపాకి చివర బాణంలా చెక్కి వున్న ఒక యినుప కడ్డీ వుంది. ట్రిగ్గర్ నొక్కితే ఆ బాణం దూసుకుపోయి గుచ్చు

కుంటుంది. అండర్ వాటర్‌లో రివాల్వర్, తుపాకి బదులు దానిని ఉపయోగిస్తారు.

దాదాపు ఇరవైమంది సముద్రంలోకి దూకి తమనుచుట్టుముట్టేసరికి కెప్టెన్ రవిశంకర్‌కు మతి పోయినట్లయింది. తానెంత మూర్ఖుడో అర్థం అయింది. తమ ప్రతి చర్య వారు గమనిస్తున్నారంటే నౌక అడుగు భాగంలో టెలివిజన్, మైక్రోఫోన్ ఉండి వుండాలి. సరిగ్గా తామున్న చోటుకే వచ్చారు గనుక టెలివిజన్ వుండి వుండాలి. చీకటిలో లైటు వెలిగించి బాంబ్‌లను అమర్చుతున్నపుడు తమ వునికి తెలిసి వుండాలి.

ఇదంతా ఆలోచించి తనని తాను తిట్టుకున్నాడు రవిశంకర్. తాము నల్గురు వాళ్ళని ఎదిరించి నిలవలేరు. తప్పించుకుపోయినా ఎంతో దూరం పోలేరు. మధ్యలో చనిపోవటం ఖాయం. లొంగిపోయి, ప్రాణాలు దక్కించుకుంటె, దీనిని నాశనం చేయటానికి మరో ప్లాన్ ఆలోచించవచ్చు.

నౌక పైనుంచి సన్నటి నైలాన్ తాటి నిచ్చెన క్రిందకి జారవిడిచారు. ఆ మసక చీకట్లోనే తాడు పట్టుకొని పైకి ఎక్కారంతా. పదిమందివరకు రవిశంకర్, సహచరులు అమర్చిన బాంబ్‌లను తీసివేయటానికి వెళ్ళిపోయారు.

తన దురదృష్టాన్ని నిందించుకుంటూ పైకి ఎక్కాడు. అతని అనుచరులు కూడా అతని వెనకే వచ్చారు. పైన డెక్ అంతా పగలులా వుంది. కొంతమంది వ్యక్తులు చేతిలో మిషన్ గన్స్ పొజిషన్‌లో వుంచి డెక్ చుట్టూ నిలబడ్డారు. వారిని చూడగానే ఆ నౌక ఏ దేశందో తేలిగ్గా గ్రహించాడు రవిశంకర్. చైనా దేశపు నౌక అది.

ఆ నౌక కెప్టెన్ పొట్టిగా వున్నాడు. అతని ముఖం ఫ్లాట్ గా వుంది. కనుబొమ్మలు లేవు. పిల్లికళ్ళు, చిన్న గడ్డం, పల్చగా, సాగదీసి వున్నట్లు పెదాలు, తెల్లటి యూనిఫాంలో వున్నాడు. ఆ డెక్ మీద అనుచరు లంతా అదే డ్రస్ లో వున్నారు.

"గ్లాడ్ టు మీట్ యు మిస్టర్స్!" కెప్టెన్ నవ్వుతూ చేయి ముందుకు చాపాడు. రవిశంకర్ చేయి ముందుకు అందించి "సేమ్ టు యూ. మై నేమ్ ఈజ్ రవిశంకర్, కెప్టెన్ రవిశంకర్!"

"గుడ్! మై నేమ్ ఈజ్ చాంగ్!" అని "కమాన్; లెట్స్ గో!" అని వెనక్కు తిరిగాడు. అంతలోనే వెనక్కి తిరిగి "ఓ ఐయామ్ సారి! ప్లీజ్ రిమూవ్ యువర్ డ్రస్" అని నవ్వుతూ అనుచరులలో ఒకని వైపు చూశాడు. మరు క్షణమే నలుగురికి వారిలాంటి దుస్తులీయబడ్డాయి. నలుగురూ అక్కడే డ్రస్ మార్చుకొన్నారు. వారి వస్తువుల నన్నింటిని కెప్టెన్ స్వాధీనం చేసుకున్నాడు.

నవ్వుతూ ముందుకు నడిచాడు కెప్టెన్ చాంగ్.

అతన్ని అనుసరించారు నలుగురు. వారి వెనుకే మిషన్ గన్స్ పట్టుకున్న యిద్దరు వ్యక్తులు అనుసరించారు.

అందరు కెప్టెన్ చాంగ్ వెంట, క్రింద రెండో అంతస్థులో ఉన్న చిన్న హాలులోకి ప్రవేశించారు. అక్కడ చాలా మంది సిబ్బంది చేరి తాగుతూ, తుళ్ళుతూ వున్నారు. సన్నగా మ్యూజిక్ విన్పిస్తోంది. శత్రువులకు దగ్గరలో వుంటూ అంత నిర్భయంగా సంచరిస్తున్న వారిని చూస్తే రవిశంకర్ కు ఆశ్చర్యం వేసింది. నిజంగానే వారి శక్తి యుక్తులు సాటిలేనివి అని అతనికి నమ్మకం కల్గింది.

హాలులో ప్రవేశించిన రవిశంకర్‌ను, అతని అనుచరులను చూసి హాలులో వున్నవాళ్లు ఒక్క క్షణం మాటలు ఆపేశారు. తిరిగి తాము పట్టించుకోనట్లు తమ కబుర్లలో పడిపోయారు.

నడవమన్నట్లు వెనకనుంచి గన్ బారల్‌తో పొడవటంతో ముందుకి నడిచారు. అంతా హాలు దాటి ఓ చిన్న నడవాలోకి ప్రవేశించారు. ఆ నడవా పొడుగ్గా వుంది. దానికి అటూ, యిటూ కాబిన్స్ వున్నాయి. అందరు చివరగానున్న ఒక కాబిన్‌లోకి నడిచారు. కెప్టెన్ రవిశంకర్, అతని అనుచరులను వెన్నంటి వస్తున్న గార్డ్స్ బయటే ఆగిపోయి, తలుపులు మూశారు.

ఆ కాబిన్ విశాలంగా, అన్ని ఆధునిక సౌకర్యాలతో ఉంది. ఏమాత్రం కొరత కన్పించడం లేదు. హైక్లాస్ హోటల్లోని రూమ్‌లా వుంది. అది కెప్టెన్ చాంగ్ కాబిన్ అని గ్రహించాడు రవిశంకర్.

కెప్టెన్ చాంగ్ బెడ్‌పై కూర్చున్నాడు. రవిశంకర్‌ను ప్రక్కనే వున్న కుర్చీలో కూర్చోమని సైగ చేశాడు. అతని ముందు చిన్న టీపాయ్ వుంది. దాని మీద బ్రాందీ కాబోలు సీసాలో ఉంది. దాని ప్రక్కనే నాలుగు గ్లాసులున్నాయి.

రవిశంకర్ కుర్చీనొకదాన్ని లాక్కొని కూర్చున్నాడు. అతని ప్రక్కనే అతని అనుచరులు కూడా కూర్చున్నారు కుర్చీలలో.

నలుగురికి నాలుగు గ్లాసులలో బ్రాందీపోసి, తను సీసా తీసుకున్నాడు కెప్టెన్ చాంగ్. త్రాగి గ్లాసు క్రింద పెట్టాడు రవిశంకర్.

"ఫ్రెండ్స్!" చెప్పటం ప్రారంభించాడు చాంగ్.

"ఈ పాటికే మేమెవరమో, ఏ దేశస్థులమో గ్రహించి వుంటారు. ఇంతవరకు ఎవ్వరూ మా వునికి కనుక్కోలేక పోయారు. యిప్పుడు మీరు ఆ పని చేశారు. అయినా ఫరవాలేదు. ఎంచేతంటే మీరు తిరిగి వెళ్ళలేరు గనుక!"

విషపు నవ్వు నవ్వాడు కెప్టెన్ చాంగ్.

"బహుశా మీకు, మా గురించి పూర్తిగా తెలిసి వుండదు. తెలిసుంటే యింత సాహసం చేసేవారు కారు. ఈ వార్ షిప్ అనేక ఆధునిక పరికరాలతో నిండి వుంది. అంతేకాదు, మామూలు పాసింజర్స్ నౌకల్లో ఎటువంటి సదుపాయాలు లభిస్తాయో; అవన్నీ యిక్కడ లభిస్తాయి. నౌకలోను, బయట టెలివిజన్, మైక్రోఫోన్ సెట్స్ అమర్చబడి వున్నాయి. వాటివల్ల నౌకలోను, నౌక బయట ఎక్కడ, ఏమి జరిగేది మాకు తెలిసిపోతుంది. అందువల్లే మీరు పట్టుబడ్డారు."

ఆగాడు కెప్టెన్ చాంగ్. సీసాలో ద్రవం ఒక గుక్క తాగాడు. అందరి ముఖాలలోకి చూసి చెప్పటం ప్రారంభించాడు.

"మాకున్నది ఒకే ఒక ధ్యేయం. ఎలాగయినా ఈ ప్రపంచాన్నంతా హస్తగతం చేసుకోవటం. అందుకు మొదటి మెట్టు మీ భారతదేశాన్ని కబళించటం. ఈ కార్యక్రమానికి ఎంతో శక్తి, యుక్తి అవసరం. అందువల్లే అనేక అణుబాంబులు, హైడ్రోజన్ బాంబులు తయారు చేసుకున్నాం. ఉన్నచోటునుంచి కదలకుండా ప్రపంచంలో ఎక్కడనయినా స్థావరాలను ధ్వంసంచేసే రాకెట్లను తయారుచేశాం.

ఇంత ఎందుకు? ప్రపంచ విజయానికి కావల్సిన అన్ని హంగులు అమర్చుకున్నాము. మొదట మీ దేశాన్ని ఆక్రమించుకుంటాము. మిగిలిన దేశాలు జరిగినది గ్రహించే లోపు అవికూడా మా హస్తగతం అయిపోతాయి.

ఈ కార్యక్రమానికి పాత పద్ధతులయిన నాయకులను హతమార్చటం, ఆందోళనలు రెచ్చగొట్టటం వంటివి మేము చేయం. మాకు శక్తి వుంది. యుక్తులున్నాయి. ఆ శక్తి చూపిస్తాం. ప్రపంచాన్ని లొంగ దీసుకుంటాము.

పాపం! మమ్మల్ని ఏదో చేయాలని బయలుదేరి వచ్చి వుంటారు. పూర్ ఫెలోస్! రేపల్లా అనుభవించండి. రేపు సాయంత్రం పాపం మీరు...''

కెప్టెన్ చాంగ్ చివరి చుక్క తాగేశాడు. రవిశంకర్ లేచి నిలుచున్నాడు.

''మరోమాట!'' అన్నాడు చాంగ్. ''మీరు అమర్చిన బాంబులు అన్నిటిని నిరుపయోగం చేశారు మావాళ్ళు. వాటిని గురించి పట్టించుకోకండి. వెళ్ళండి!'' మంచం దగ్గరవున్న స్విచ్ నొక్కాడు.

తలుపు తెరుచుకొని గార్డ్సు వచ్చారు లోనికి. వారితో చైనాభాషలో ఏదో చెప్పాడు కెప్టెన్ చాంగ్.

తరువాత కెప్టెన్ రవిశంకర్, జానీని ఒక కాబిన్ లోను, రతన్, రాజన్‌లను మరో కాబిన్‌లోను బంధించారు.

# 8

తనను బంధించిన కాబిన్‌లో బెర్తుమీద కూర్చొని ఆలోచించసాగాడు కెప్టెన్ రవిశంకర్. జానీ, ఆయనకు ఎదురుగా కూర్చొని మౌనంగా ఆయన ముఖంవంక చూడసాగాడు.

"జానీ! కెప్టెన్ చాంగ్ ఏదో పెద్ద ఎత్తులోనే వున్నాడు. మనల్ని వెంటనే చంపకుండా వదిలాడంటే బహుశా తన పై అధికార్ల నుంచి ఆర్డర్స్‌కోసం యెదురు చూస్తున్నాడేమో. ఏది ఏమయినా మనల్ని తేలిగ్గా చంపరు. చిత్రహింసలు పెట్టి, అనేక రహస్యాలు తెల్సుకొంటారు. ఈ లోపుగానే మనం నౌకలోనుండి తప్పించుకోవాలి. కాని ఎలా?"

ఎంత ఆలోచించినా ఏ దారి తోచలేదు. కిటికీదగ్గరకు నడిచి, గ్లాస్‌లోనుంచి కన్పిస్తున్న చీకటిలోకి చూశాడు. అంతా అంధకారం. ఆలోచనలతో ఆ రాత్రి ఆయనకు సరిగ్గా నిద్రే పట్టలేదు.

మరునాడుదయమే గార్డ్స్ వెంట ఒక బట్లర్ వచ్చి కాఫీ, టిఫెన్‌లు యిచ్చాడు. రాత్రికూడా తిండి లేక పోవటంవల్ల మారు మాట్లాడకుండా ఐటమ్స్ అన్నిటినీ ఖాళీ చేశారు. తరవాత చాంగ్ వచ్చి పరామర్శించి వెళ్ళిపోయాడు నవ్వుతూ.

అతని నవ్వు చూస్తుంటే జానీకి ఒళ్ళంతా కంపరం ఎత్తినట్లయింది. అమాంతం మీదపడి చంపేద్దాం అన్నంత ఆవేశం వచ్చింది. అతిప్రయత్నం మీద నిగ్రహించుకున్నాడు. అతడు వెళ్ళిపోగానే తలుపులు బంధించబడి, తాళం వేయబడ్డాయి.

కెప్టెన్ రవిశంకర్ పరిపరి విధాలుగా ఆలోచిస్తున్నా, అతనికేమి పాలుపోలేదు. తాము తప్పించుకోవటం అసాధ్యమే అనుకున్నాడు. 'షిప్ మీద దాడికి రావల్సిన యుద్ధ విమానాలు యింకా ఎందుచేత రాలేదు? తన వార్తల కోసం యెదురుచూస్తున్నారా?' అన్పించింది.

చివరికి తన ప్రాణాలు పోయినాసరే వీలయినంతమందిని చంపి, తను చావాలని నిశ్చయించుకున్నాడు. అదేమాట చెప్పాడు జానీతో.

పదిగంటల సమయంలో బాంబ్ ప్రేలుళ్ళు, విమానం మోత విన్పించాయి. పరుగున గ్లాస్ విండోవద్దకు వెళ్ళి చూశాడు. నాలుగు యుద్ధవిమానాలు దాడి ప్రారంభించాయి.

షిప్ అంతా గడగడలాడింది. ఆ దాడిలో గ్లాస్ విండో పగిలిపోతే బావుండు నన్పించింది కెప్టెన్ రవిశంకర్‌కి. అయితే ఆయన ఆశలు ఫలించలేదు. షిప్‌కి ఏ విధమైన నష్టం జరగలేదు, కాని ఆ నాలుగు యుద్ధవిమానాలు నాశనం అయిపోయాయి.

కోపంతో విండోకేసి గుప్పిట బిగించికొట్టాడు రవిశంకర్. అది చాలా గట్టిది. కనీసం చిట్లనయినా చిట్లదని తెలుసు.

మధ్యాహ్నం తలుపు తాళం తెరుచుకుని బట్లర్ ట్రేతో ప్రవేశించాడు. అప్పటికి అంతా నిమ్మళించి సద్దుమణిగింది. బట్లర్ వెనుక ఇద్దరు గార్డులు తయారయ్యారు. రవిశంకర్ అప్పటికే వారిద్దరిమీద పడి ఎదురుదెబ్బ తీయాలని నిశ్చయించుకున్నవాడు, బట్లర్‌ని చూసి చిన్నగా ఉలిక్కిపడ్డాడు. జానీకూడా అంతే!

ట్రే పైన కప్పిన గుడ్డను తీస్తూ ముందుకి వంగిన బట్లర్ చిన్నకాగితాన్ని ఒకకప్పు వెనక్కి నెట్టటం ఇద్దరు గమనించారు. గార్డ్స్ యిద్దరు బట్లర్ వెనక వుండటంవల్ల చర్యని గమనించలేదు. రవిశంకర్ కళ్ళల్లోకి ఓమారు చూసి వెళ్ళిపోయాడు బట్లర్. తలుపు తాళం వేయబడింది.

"సులేమాన్!" ఆశ్చర్యంగా అన్నాడు జానీ.

తల పంకించాడు కెప్టెన్ రవిశంకర్.

# 9

"మీనుండి విడిపోయిన తరువాత నేనొక్కడినే స్వతంత్రంగా పనిచేయాలని నిర్ణయించుకున్నాను. అందరం ఒక్కసారే వెళ్తే, దురదృష్టవశాత్తు పట్టుబడితే తప్పించుకోవటానికి వీలుండదన్న అభిప్రాయంతోనే ఈ నిర్ణయానికి వచ్చాను. కాని నా అభిప్రాయం మీకు చెప్పలేదు.

అందరం, అంటే ముందు మీరు, మీకు కొద్దిదూరంలో నేను ఈదుకుంటూ షిప్‌ని చేరాము. కాని మీ ప్లాన్ మారిందని నాకు తెలియదు. పైకి చేరుకోవటానికి మార్గం వెతుకుతున్నపుడే మిమ్మల్ని గమనించి, పట్టుకోవడం జరిగింది. ఆ సమయంలో సముద్రం అడుగున చాలా లోతులో, దూరంగా ఈదుకుంటూ పోయాను.

మిమ్మల్ని పైకి ఎక్కించిన తరవాత కొంతమంది మీరు అరేంజ్ చేసిన బాంబ్‌లను తీసివేయటానికి వచ్చారు. అప్పుడే అతి చాకచక్యంగా ఒకడి ఆక్సిజన్ సిలిండర్ గొట్టాన్ని తెంపి, చంపేశాను. వాళ్ళతో పాటు కల్సిపోయి పైకి చేరాను. వారి దుస్తులు, నా దుస్తులు ఒకలాగే వుండటం నా అదృష్టం.

తరవాత బట్లర్‌లలో కల్సిపోయాను. నన్ను ఎవరూ గుర్తు పట్టలేదు. కారణం బట్లర్‌లను బానిసలుగా చూస్తున్నారు. మిమ్మల్ని తప్పించటానికి విశ్వప్రయత్నం చేశాను. కుదరలేదు. క్షమించండి. చివరివరకు నా కర్తవ్యాన్ని వీడను. జైహింద్."

అది చదివి నిర్ఘాంతపోయాడు కెప్టెన్ రవిశంకర్. కాగితాన్ని జానీకి యిచ్చాడు. అతడుకూడా చదివిన తరువాత దాన్ని చింపి ముక్కలు ముక్కలుగా చేశాడు.

తన ప్లాన్‌లో వున్న లోటేమిటో తెల్సిందతనికి. అనుభవజ్ఞుడయిన తాను యింత పొరపాటు పని చేస్తాడని, తనింత మూర్ఖుడని భావించలేదు తను. బహుశా తనలోని ఈ అహంకారాన్ని గుర్తించే కాబోలు సులేమాన్ తన పథకాన్ని తనతో చెప్పలేదు.

మౌనంగా భోజనాలు ముగించారు. అవతల రాజన్, రతన్ పరిస్థితీ అలాగే వుంది. ఎంతో ఉత్సాహంతో చివరివరకు కృతకృత్యులయిన తాము, చివరి క్షణంలో పట్టుబడటం వారిని నిరాశా నిస్పృహలకు దారి తీయించింది. బోనులో బంధించబడ్డ సింహంలాగా తిరుగుతున్నాడు రాజన్.

సాయంత్రం నాలుగ్గంటల ప్రాంతంలో గార్డ్స వచ్చి నలుగురిని డెక్ మీదకు తీసుకుపోయారు. అప్పటికే అక్కడ కెప్టెన్ చాంగ్ చిన్న సింహాసనంలాంటి కుర్చీలో కూర్చొని ఏదో తాగుతున్నాడు. అతనికి ఎదురుగా, వరసాగా నిలబెట్టారు రవిశంకర్ బృందాన్ని. నలుగురు ఫ్రీగా ఉండటంవల్ల తప్పించుకోవడానికి ఉపాయాలు వెదకసాగారు.

డెక్ చుట్టూ సాయుధులైన వ్యక్తులు మిషన్‌గన్స్‌తో రెడీగా నిలబడ్డారు. కాలు కదిపితే వళ్ళంతా చిల్లులు పడేలా వుంది.

పడమట సూర్యుడు వాలిపోతున్నాడు. సూర్యునివైపు వీపు పెట్టి నిలబడ్డారు నలుగురు. వారికెదురుగా కూర్చొని వున్నాడు కెప్టెన్ చాంగ్.

"మిస్టర్ రవిశంకర్! నేను చాలా జాలి గుండెల వాడినని అందరూ అంటారు. అందుకే కాబోలు మిమ్మల్ని చంపదలచలేదు."

ఆగి మరో గుక్క తాగాడు. అతడేదో ఎత్తువేయబోతున్నాడని అర్థం అయింది కెప్టెన్ రవిశంకర్‌కి.

"నాకు జూదం అంటే చాలా ఇష్టం. ఇప్పుడు గమ్మత్తయిన ఓ ఆట ఆడబోతున్నాను. పందెం ఏమిటో తెల్సా? మీ ప్రాణాలే!" పకపక నవ్వాడు.

చెవులు రిక్కించి వింటున్నారు నల్గురు.

"ఇంతవరకు అపజయం ఎరుగని నన్ను, నా షిప్‌ను నాశనం చేయాలని ఎంతో మంది ప్రయత్నించి ప్రాణాలు పోగొట్టుకున్నారు. ఇక్కడికి వచ్చిన వారెవరు తిరిగి వెళ్ళలేదు. మొదటి సారిగా మీరు వెళ్ళబోతున్నారు.

ఇప్పుడు మిమ్మల్ని వదిలేస్తాను. సరిగ్గా అరగంట తరువాత మేము కాల్పులు సాగిస్తాం. బాంబులు వేస్తాం. తప్పించుకుంటే మీ అదృష్టం. అంతా లక్! [illegible] ఉంది?" వికటంగా నవ్వాడు కెప్టెన్ చాంగ్.

అరగంటలో తీరాన్ని చేరుకోవడం కాదుగదా, కనీసం ఈ ప్రాంతాల నుంచి వెళ్ళటం కూడా సాధ్యం కాదని రవిశంకర్‌కు తెలుసు. తాము ఎంతదూరం పోయినా, వాళ్ళ ఆయుధాలు శక్తివంతమయినవి. తాము తప్పించుకోవటం కల్ల.

ఎవరో వచ్చి కెప్టెన్ చాంగ్ చెవిలో ఏదో చెప్పాడు. అది వినగానే అదిరిపడ్డాడు చాంగ్.

"ఆయ్! మన షిప్‌లో మరొక శత్రువా? తీసుకురండి. క్విక్!" అరిచాడు అసహనంగా.

మరుక్షణమే పెడరెక్కలు విరిచి పట్టుకొని, సులేమాన్ని నెట్టుకుంటూ ప్రవేశించారు ఇద్దరు వ్యక్తులు. రవిశంకర్ అదిరి పడ్డాడు. అతనికున్న ఒక్క ఆశ హరించి పోయింది.

# 10

"మిస్టర్ రవిశంకర్! ఇతను నీ బృందంలోనివాడే ననుకుంటాను. చాలా తెలివిగా పథకం అల్లావు. నాకు చిక్కినట్లే నటించి మరొకన్ని నియమించావు అవునా?"

కెప్టెన్ చాంగ్ ఇందాకటిలా లేడు. ముఖం జేవురించింది. కళ్ళు చింత నిప్పుల్లా తయారయ్యాయి. సులేమాన్ దగ్గరకు నడిచి, ఈడ్చి చెంపమీద కొట్టాడు. పళ్ళు కదిలి, రక్తం బయటకు వచ్చింది.

"మిమ్మల్నిక బ్రతకనివ్వను. ఇందాకటి ఆటను రద్దు చేస్తున్నాను. నా కళ్ళ ముందే మిమ్మల్ని చిత్రహింసలు పెట్టి నాకసి తీర్చుకుంటాను." వెనుదిరిగి టేబుల్ దగ్గరకు నడిచాడు ఛాంగ్.

సులేమాన్ నెమ్మదిగా చేయి ఎత్తి వాచ్ చూసుకున్నాడు. ఎవరో హడావిడిగా వచ్చి చాంగ్ చెవిలో ఏదో ఊదారు.

"క్విక్! వెంటనే వెదకండి! డిటెక్టర్స్‌తో చూడండి!" చిందులేస్తున్నాడు కెప్టెన్ చాంగ్.

సులేమాన్ తనపథకం ఫలించినందుకు తృప్తిపడ్డాడు. ఇంజన్ రూంలో, కంట్రోలు రూంలో, మరికొన్ని ముఖ్యమైన చోట్ల శక్తివంతమయిన బాంబులు అరేంజ్ చేశాడు.

మరొక అయిదు నిమిషాలలో పేలుతాయి అవి. ఈ లోపు తాము తప్పించుకోవాలి. బాంబులన్నింటిని కను

గొనటం వారికి అసాధ్యం.

ఇంతలో ఆకాశంలో విమానాల ధ్వని విన్పించింది. అందరూ ఉలిక్కిపడి చూశారు. భారత గగనతలంనుండి రివ్వున ఎగురుకుంటూ వస్తున్నాయి కొన్ని విమానాలు.

తన మేసేజ్ అందినందుకు సంతోషించాడు సులేమాన్. రవిశంకర్ కళ్ళల్లోకి చూశాడు. అప్పటికే అంచుకి, తమకు మధ్య ఉన్న దూరం అంచనా వేసుకున్నాడు రవిశంకర్. వెనక్కి ఒక్క జంప్ చేస్తే సముద్రంలో పడిపోతారు.

విమానాల శబ్దం వినటంతోనే కెప్టెన్ చాంగ్ లో కంగారు ఎక్కువయింది.

"ఫైర్" అని అరిచాడు.

కాని, అప్పటికే లేటయిపోయింది. అతని ముఖంలో భావం కనిపెట్టి, మెరుపులా వెనక్కి గెంతుతూ, "జంప్" అని అరిచాడు కెప్టెన్ రవిశంకర్. అయిదుగురూ సముద్రంలోకి దూకేశారు.

పిచ్చిగా అరుస్తూ రెయిలింగ్స్ దగ్గరకు వచ్చి తొంగి చూశాడు కెప్టెన్ చాంగ్. నీటిలో పడిన సులేమాన్ పైకి తేలి హేండ్ గ్రనేడ్ ఒకటి పైకి విసిరి రివ్వున లోనికి పోయాడు. పైనుంచి కాల్చిన కాల్పులకి ఒక గుండు అతని భుజంలో దిగబడింది.

అయిదుగురు నీటిలో మునిగి నౌకకి దూరంగా ఈదుకుంటూ పోసాగారు. సులేమాన్ విసిరిన గ్రనేడ్ పేలి కొంతమంది మరణించారు. చాంగ్ కి మతిపోయినట్లయి కంట్రోలు రూంలోకి పరుగుతీశాడు.

ఇంతలో షిప్ లో పెద్ద ప్రేలుడు సంభవించింది. మరుక్షణమే షిప్ భగభగమంటూ మండసాగింది. దానిలోని

ఇతర ఎక్స్‌ప్లోజివ్స్ కూడా అంటుకున్నాయి.

అదే సమయంలో...

పెద్ద విస్ఫోటంతో షిప్ అంతా తుత్తునియలై పోయింది. దాని భాగాలు ఎగిరి పడ్డాయి.

ఆ సరికే చాలా దూరంపోయారు రవిశంకర్ బృందం వారు.

భారత విమానాలు, వారి మీదుగా ఎగరసాగాయి. రవిశంకర్ పైకి తేలుతూ చేతులూపాడు. వాటిల్లోనుంచి క్రిందకి నిచ్చెనలు వేలాడ వేయపడ్డాయి.

"వెల్‌కం టు-ది ఫైవ్ మెన్ ఆర్మీ!" విమానం పైలెట్ రవిశంకర్ బృందాన్ని చిరునవ్వుతో ఆహ్వానించాడు.

—: ఐపోయింది :—

# ద్రోహి

సుజనశ్రీ

"నాయర్!" పద్మనాభన్ కేకకు మెస్ అంతా అదిరి పడ్డారు.

సన్నగా ఉన్న నాయర్ పరుగెత్తుకుంటూ వచ్చాడు.

"ఏం సార్!" అన్నాడు వినయంగా.

పద్మనాభన్ అతడి వంక ఉరిమి చూశాడు. ఖడ్గ మృగం పరిమాణంలో ఉన్న పద్మనాభన్ ముందు నాయర్, పులిముందు నిలబడ్డ నక్కలాగ ఉన్నాడు.

"నీ వంట రోజురోజుకూ ఇలా తగలడుతోందేం? ఇది మనుష్యులు తినేదేనా! పందులు తినేదా?"

"తమరు కోపంలో ఉన్నారు. అందరూ ఈ రోజు వంటకాలు బాగున్నాయని మెచ్చుకున్నారు సార్!"

నసుగుతూన్నట్టుగా బదులు చెప్పాడు నాయర్.

"అంటే నేను అబద్ధం చెబుతున్నాననేగా? ఈ పద్మ నాభన్‌కి ఎదురు చెప్పేందుకు నీ కెన్ని గుండెలు?" అంటూ పద్మనాభన్ తన ముందున్న ప్లేట్‌ని తీసి నాయర్ మీదకు విసిరేశాడు.

అది ముందే ఊహించిన నాయర్ తటాలున క్రిందకు వంగాడు.

ప్లేట్ గాలిలో గిరగిర తిరుగుతూ వెళ్ళి అవతల వరుసలో కూర్చుని భోజనాలు చేస్తున్న వారిలో ఒక నావికుడికి వెళ్ళి కొట్టుకుంది.

ఆ నావికుడు కొరకొర పద్మనాభన్ వంక చూశాడు. ప్లేట్‌లోని ఎంగిలి పదార్థాలు చెల్లాచెదురుగా ఇతరుల ప్లేట్‌లో పడ్డాయి. వారందరూ పద్మనాభం వంక చూశారు గుర్రుగా.

అయితే అందులో ఎవరికీ పద్మనాభన్‌ని ఎదుర్కొనే ధైర్యం లేదు.

పద్మనాభన్ ఆరడుగుల ఎత్తూ, ఉక్కు కడ్డీల్లా మెలి తిరిగిన కండరాలతో ఎనుబోతులా గుంటాడు. అతడు మంచి బాక్సర్ కూడ! మల్లయుద్ధంలో అనేక ప్రైజుల్ని గెలుచుకున్నవాడు. అతడు నావికాదళంలో చేరాడు.

ప్రస్తుతం నావ "జలపుష్ప" కెప్టెన్ ఛటర్జీకి బాక్సర్స్ అంటే మహా ఇష్టం! అందుకే కండబలం తప్ప మరో ప్రజ్ఞ లేని పద్మనాభం త్వరలోనే ఛటర్జీకి చాల సన్నిహితుడైనాడు.

కెప్టెన్ ఆసరా చూసుకుని పద్మనాభం అతిగా ప్రవర్తిస్తుంటాడు. అతడి చేతిలో దెబ్బలు తినని నావికులు, ఆ ఓడలో అయిదారుగురికన్న ఎక్కువ ఉండరు!

అందరికీ అతడంటే చెప్పలేనంత ద్వేషం. ఎవడైనా ధీరుడు ఊడిపడి పద్మనాభం పొగరు అణిస్తే బాగుండునని ఎవరికివారే లోలోపల ఉవ్విళ్ళూరుతుంటారు.

పద్మనాభం తను కూర్చున్న చోటునుంచి లేచాడు. నాయర్ దగ్గరకు వెళ్ళాడు. అతడి చొక్కా కాలరుపట్టుకుని నిటారుగా లాగాడు. పిడికిలి బిగించి నాయర్ గుండెల్లో గుద్దాడు.

"అమ్మో!" అని అరిచాడు నాయర్ మెలికలు తిరిగిపోతూ.

పద్మనాభం వికటంగా నవ్వాడు. మరో గుద్దుపడింది. నాయర్ నోటంట రక్తం పడింది.

అందరూ ఆత్రంగా లేచి అతడి చుట్టూ మూగారు. అయినా పద్మనాభం తగ్గలేదు. అతడి పిడికిలి మరోసారి పైకి లేచింది.

ఈ తడవ దెబ్బ పడితే నాయర్ ప్రాణాలొదలటం ఖాయమనుకున్నారు అందరూ. ఏమవుతుందా అని ఊపిరి బిగబట్టుకుని చూస్తున్నారు.

"పద్మనాభం! మరో దెబ్బ పడిందో నీ అంతు నేను చూసి తీరతాను!" ఎవరో అరిచారు.

పద్మనాభం ఎత్తిన చేయి ఎత్తినట్టుగానే వుండిపోయింది.

అంతా ఆ కంఠం మ్రోగిన దిక్కై చూశారు. ఆ మాటలు అన్నది ఎవరో కాదు! జాన్సన్!

జాన్సన్ కూడా మంచి ఆజానుబాహువే, కానీ పద్మనాభంకి సరి అయిన ఉజ్జీ మాత్రం కాదు!

జాన్సన్ మితభాషి, మంచి నడవడి కలవాడు. కెప్టెన్ కి

అతడంటే గౌరవం ఉంది. పద్మనాభం చేయి ఏనాడూ జాన్సన్ ఒంటిమీద పడలేదు.

పద్మనాభం నిప్పులు గ్రక్కే కళ్ళతో జాన్సన్ వంక చూసి, మళ్ళీ తల త్రిప్పుకున్నాడు.

"నీ నక్కజిత్తులు నా దగ్గర కాదు నాయర్! లేచి వెళ్ళి వాళ్ళందరికీ తిరిగి వడ్డించు. సగం తినేకంచాల్లో నా ఎంగిలి పడింది, నీ మూలంగా!" అంటూ ఠీవిగా క్యాబిన్ వేపు అడుగులు వేసుకుంటూ వెళ్ళిపోయాడు పద్మనాభం.

నాయర్‌ని లేపి ఒక బెంచీ మీద పడుకోబెట్టారు. నీళ్ళు త్రాగించాక కొద్దిగా తేరుకున్నాడు నాయర్!

అందరూ జాన్సన్‌ని అభినందించసాగారు.

"మీరు కలుగజేసుకోకపోతే ఇవాళ నాయర్ చచ్చిపోయి ఉండేవాడు!" అన్నారు కొందరు.

"వాడికెంత కావరం! వాడి పొగరణిగే రోజు ఎప్పుడు వస్తుందో ఏమో?" మరెవరో అన్నారు.

నాయర్ చాల నీరసంగా ఉన్నాడు. అతడ్ని వేరే రూమ్‌లోకి తీసుకెళ్ళి డాక్టర్‌కి కబురు పెట్టారు.

మరో వంటవాడు, బట్లర్ వచ్చి, మళ్ళీ నావికులకు భోజనం వడ్డించసాగారు.

## 2

ఆకాశంలో చంద్రుడు విహరిస్తున్నాడు తారకల మధ్యగా. భారత నౌకాదళానికి చెందిన నౌక "జలపుష్ప" కొచ్చిన్ రేవుని వదిలి బంగాళాఖాతంలో ప్రయాణిస్తున్నది.

బంగ్లాదేశ్‌లో ముజీబుర్ రెహమాన్ నాయకత్వంలో మొదలైన అంతర్యుద్ధానికి మద్దతుగా భారత్ సైన్యాలు

ఢాకాని చక్రబంధంలో ఇరికించినయ్. ఢాకాలో పాకిస్తాన్ సైన్యాలు లొంగిపోవటానికి ఇరవయ్ నాలుగు గంటలు టైమ్ ఇవ్వబడింది.

ఇంతలో అమెరికా సప్తమ నౌకాదళం, సెవెన్త్ ఫ్లీట్ పాకిస్తాన్‌కి సాయపడే నెపంతో హిందూ మహా సముద్రం వైపుగా ప్రయాణిస్తున్నట్టు వార్త లందాయి.

సప్తమ నౌకాదళం భారతదేశాన్ని చేరుకోకముందే, ఢాకాని వశపరుచుకుని, యుద్ధం సమాప్తి చేసి, శాంతిని ప్రకటించాలని భారత ప్రభుత్వం ఉద్దేశ్యం. ఈ లోపల ఢాకాని చుట్టు ముట్టిన భారత సైన్యపు టాంక్ లకు కొన్ని ముఖ్యభాగాలు అవసరమైనయ్.

ఆ ముఖ్య భాగాలను, మరికొంత అమ్యూనిషన్ ఆయుధ సామగ్రిని సముద్రం మీదుగా బంగ్లాదేశ్ పంపవలసి వచ్చింది. వాటన్నిటినీ మూడు భాగాలుగా విభజించి, మూడు నౌకల ద్వారా రవాణా చేయదలిచింది ప్రభుత్వం!

పాకిస్తాన్ విమానాలు కరాచీలో బయలుదేరి శ్రీలంక చేరుకుని, అక్కడనుంచి బంగ్లాదేశ్ చేరుకుని బాంబులు వేస్తూ వచ్చాయ్. కనుక తాము పంపదలచుకున్న సామగ్రిని ఒకే నౌకలో రవాణా చేస్తే, ఆ నౌకను పాక్ విమానాలు ముంచివేసే ప్రమాదం ఉంది. అందుకే విడివిడిగా మూడు నౌకల్లో పంపుతున్నారు.

అలా బయలుదేరిన నౌకల్లో రెండోది జలపుష్ప! మూడురోజుల క్రితమే మొదటి నౌక బయలుదేరి వెళ్ళిపోయింది.

"జలపుష్ప" డెక్ మీద రెయిల్స్ కానుకుని నిలబడి సిగరెట్ కాలుస్తున్నాడు జాన్సన్.

రాజు కూడ అతడివద్దకు చేరుకున్నాడు.

జాన్సన్ ఇంకా కోపంగా ఉన్నాడని తెలుసుకున్నాడు రాజు. తనూ సిగరెట్ వెలిగించాడు. వారిద్దరిమధ్యా కొద్ది సేపు మౌనం తాండవించింది.

"ఆ పద్మనాభంగాడికి నా చేతుల్లో త్వరలోనే చావు రాసిపెట్టి ఉంది!" అన్నాడు జాన్సన్ నెమ్మదిగా.

"నాయర్ అంటే నీ కెందుకంత ఇది? అతడు నీకేమైనా బంధువా?" రాజు అడిగాడు.

"జీవితంలో బంధువులకన్న మిత్రులే ఆ ప్రులౌతుంటారు? నీవెంతవరకు నాకు బంధువో, నాయర్ కూడా అంతే బంధువు!" అన్నాడు జాన్సన్.

జాన్సన్ అంటే రాజుకి ఎంతో అభిమానం! రాజు అంటే జాన్సన్ కి ఆరోప్రాణం. ఇద్దరూ అంత సన్నిహితులు. ఇద్దరూ కాస్సేపు పిచ్చాపాటి మాట్లాడుకొని లోపలికి నడిచారు.

# 3

మర్నాడు మెస్‌లో నాయర్ ఒక పక్కగా కూచుని తన స్థానంలో వచ్చిన బట్లర్ కి సూచనలిస్తున్నాడు.

అతడు మనిషి తెల్లగా పాలిపోయాడు. ఎన్నో నెలల తరబడి జబ్బుగా ఉండి, అప్పుడే కోలుకున్న మనిషిలా కనుపించాడు.

"హాయిగా వెళ్ళి రెస్ట్ తీసుకోకూడదూ, ఇక్కడ పని చేసి అలసిపోకపోతే?" అనడిగాడు రాజు.

"బెడ్ లో పడుకుంటే అసలు తోచటం లేదండీ! అందుకే వచ్చి ఇక్కడ కూర్చున్నాను. తిరిగే కాలూ, వాగే నోరూ ఊరికే ఉండలేవని గదా సామెత!" అంటూ

నవ్వాడు నాయర్, యూనిఫారం కాలర్ సాగదీసు కుంటూ.

రాజు, జాన్సన్ భోజనం చేస్తున్నారు. నాయర్ నోరు మూత పడకుండా వాగుతూనే వున్నాడు.

"రాజూ! నీళ్ళందుకో!" అని అరిచాడు జాన్సన్, మెలికలు తిరుగుతున్న నాయర్‌ని పొదివి పట్టుకుని.

రాజు లోటాలో నీళ్ళందించాడు. నాయర్ నీళ్ళు త్రాగాడు. దగ్గు కొద్దిగా సద్దుకుంది.

పద్మనాభం అప్పుడే మెస్‌లోకి అడుగు పెట్టాడు.

"ఆ టీ. బీ. పేషెంట్‌ని శవాల గదిలో పారేయక ఇక్కడెందుకుంచారు! ఒరేయ్! నీ మూలంగా ఆ వ్యాధి అందరికీ అంటిస్తావురా! ఇక్కడ నుంచి బయటకు తగ లడు!" అని అరిచాడు పద్మనాభం.

నాయర్‌ని వదిలేసి, జాన్సన్ పులిలా పద్మనాభన్ మీదకు దూకాడు.

పద్మనాభన్ పీక పుచ్చుకుని అటూ ఇటూ కుదించే శాడు జాన్సన్.

పద్మనాభం పిడికిలి బిగించి జాన్సన్ పొట్టలో గుద్దాడు. జాన్సను చేతులు విడిపోయినయ్. క్రింద పడిపోకుండా నిలదొక్కుకున్నాడు జాన్సన్. తన కుడికాలుతో బలంగా పద్మనాభం గడ్డంక్రింద తన్నాడు.

పద్మనాభం కూర్చున్న చోటినుంచి వెనక్కు పడి పోయాడు.

జాన్సన్ నాయర్‌ని పసిపిల్లవాడిలా ఎత్తుకుని మెడికల్ రూమ్‌లోకి తీసుకుపోయాడు. బెడ్ మీద పడుకోబెట్టి అతడా స్థితికి ఎలా వచ్చిందీ క్లుప్తంగా వివరపరిచాడు డాక్టర్‌కి.

డాక్టర్ ట్రీట్‌మెంట్ ఇచ్చాక నాయర్ సుఖనిద్ర లోకి జారుకున్నాడు,

ఆ రోజల్లా జాన్సన్ నాయర్ ప్రక్కనే కూర్చుని అతడ్ని కనిపెట్టుకుని వున్నాడు.

రాజు లెఫ్టినెంట్‌ని కలుసుకున్నాడు. నాయర్‌ని కని పెట్టుకుని వుండటానికి జాన్సన్‌కి అనుమతి తెచ్చాడు.

మధ్యాహ్నం మూడుగంటలు కావస్తున్నది. జలపుష్ప నౌక వేగంగా ప్రయాణిస్తున్నది, తన గమనం వేపు! ఏ ఆటంకమూ లేకుండా వుంటే, మరో ముప్ఫయిగంటల్లో నౌక చిట్టగాంగ్ చేరుకుంటుంది.

నాయర్ స్పృహలేని స్థితిలో ఇంకా బెడ్‌మీదనే వున్నాడు. అతడ్ని కనిబెట్టుకుని జాన్సన్ అతడి ప్రక్కనే కూర్చున్నాడు. రాజు మరోప్రక్క వున్నాడు.

## 4

నౌకలో సైరన్ మ్రోగింది. ఎవరైనా శత్రువులు వెంటాడుతున్నా లేక దాడికి వస్తున్నా మ్రోగే అలారం అది.

రాజు ఆశ్చర్యంగా, భయంగా జాన్సన్ ముఖంలోకి చూశాడు.

"సైరన్ మ్రోగుతోంది. అంటే అందరూ తమ ఆయుధాలు తీసుకుని కెప్టెన్ ముందుకెళ్ళాలన్నమాట! లే జాన్సన్! పద పోదాం!"

"నేను రాను! నాయర్‌ని కనిబెట్టుకుని ఇక్కడే వుంటాను! నీవు వెళ్ళు రాజూ!"

"నీకేం మతి చెడిందా? నీవిక్కడే కదలకుండా వుంటే, పై అధికార్లను తిరస్కరించినట్లవుతుంది

తెలుసా?'' కొన్ని విషయాల్లో జాన్సన్‌ది మొండిపట్టు అని రాజుకి బాగా తెలుసు!

''తర్వాత ఏమన్నా అవనీ! నీవు వెళ్ళిపో! నా గురించి నీవు ఆగద్దు!'' జాన్సన్ మొండిగా అన్నాడు.

రాజు మెషీన్‌గన్ చేతబుచ్చుకుని డెక్‌మీదకు పరుగెత్తాడు.

అప్పటికే డెక్‌మీద కోలాహలంగా వుంది. మెషిన్‌గన్స్ పుచ్చుకుని నావికులు పొజిషన్స్‌లోకి వెళ్తున్నారు. కెప్టెన్ గొంతు చించుకుని అరుస్తున్నాడు.

ఇద్దరు ముగ్గురు సైనికులు స్టీరింగ్‌వీల్ దగ్గర నిలబడి వున్నారు.

డెక్ చివరగా, రెయిల్స్ దగ్గరకు వెళ్ళాడు రాజు. అతడికి ప్రక్కగా నిలబడివున్న మైత్రా ఆకాశంలోకి చూస్తున్నాడు.

''అమెరికన్ ఫాంటమ్ ఫైటర్స్ అవి! నాలుగు వచ్చినయ్!'' అన్నాడు మైత్రా.

నౌకకు మూడుమైళ్ళ రేంజ్‌లో, శవంచుట్టూ తిరుగాడే గద్దల్లా, నాలుగు విమానాలు ప్రదక్షిణం చేస్తున్నయ్. అవి ఏ క్షణాన అయినా నౌకమీదకు బాంబుల వర్షాన్ని కురిపించేలా వున్నయ్. నౌకలోని ప్రేలుళ్ళకు దూరంగా తప్పించుకుని తగు జాగ్రత్తలోనే ప్రదక్షిణం చేస్తున్నయ్ విమానాలు.

అవి ఎప్పుడు రేంజ్‌లోకి వస్తాయా, ఎప్పుడు కాలుద్దామా అని సైనికులు కాచుకుని వున్నారు.

విమానాలు ఎటు మళ్ళితే నావికుల తలలూ అటే తిరుగుతున్నయ్.

కెప్టెన్ చ్యాయింగ్ గమ్ నములుతూ విమానాలవంక కోపంగా, గుర్రుగా చూస్తున్నాడు.

ఆ విమానాలు ఒక్కుమ్మడిగా దాడి చేయవేం? ఎందుకలా తీరిగ్గా చుట్టూ తిరుగుతాయ్. వాటిల్లోని బాంబుల్ని తల్చుకుంటేనే రాజుకు కంపరం కలుగుతోంది. నాలుగు శత్రువిమానాలు! నాలుగూ ఒక్కసారే విజృంభించి నౌకను ముంచేస్తే?

"మనమీదకు రారేం వాళ్ళు?" రాజు అసహనంగా అడిగాడు.

ప్రక్కనే వున్న మైత్రా నవ్వాడు వేదాంతిలా!

"పిల్లికి చెలగాటం! ఎలుకకు ప్రాణసంకటం! ఆ విమానాల్ని తప్పించుకుని మన షిప్ పోలేదని వాళ్ళ ధైర్యం! మన మనోనిగ్రహాన్ని, గుండెనిబ్బరాన్ని చీలదీసేందుకు వాళ్ళు తమ బలప్రదర్శన చేస్తున్నారు!" మైత్రా చెప్పాడు.

అంటే వాళ్ళు తమతో చెలగాట మాడుతున్నారన్న మాట! రాక్షసులు! ఉద్వేగంతో, ఆవేశంతో తాము వణికిపోయేలా చేయాలని వాళ్ళ ఉద్దేశ్యం. ఆ విమానాల రొదతో తమకు పిచ్చెక్కేలా చేద్దామని వాళ్ళ ఊహ?

తనకు ఆహారంగా దొరికిన జంతువుని సగం సగం చంపి, నింపాదిగా తినబోయే క్రూరమృగంలా, వాళ్ళు తమ చుట్టూ తారట్లాడుతున్నారు అనుకున్నాడు రాజు. ఆలస్యమవుతున్నకొద్దీ అతడికి చెమటలు క్రమ్మసాగింది.

వలయాకారంలోంచి ఒక విమానం మళ్ళింది. పదిహేను వందల అడుగుల దూరంలో, నలభై ఐదు డిగ్రీల కోణంలో దూసుకువస్తోంది ఆ విమానం, నౌకమీదకు.

బహుశా నావికుల ఫైరింగ్ రేంజ్ ని పరీక్షించటాని కేమో!

విమానంలోంచి గుండ్లవర్షం కురుస్తోంది. మొదట కొన్ని సముద్రంలో పడినయ్. విమానం నాకమీదుగా సర్రున దూసుకుపోయింది. గుండ్లు నాకమీద పడలేదు.

నాకలోంచి మిషన్ గన్స్ గర్జించినయ్. కాని అవి విమానాన్ని తాకలేకపోయినయ్.

రెండో విమానం దూసుకువస్తోంది మళ్ళీ! దాంట్లోంచి చిన్నసైజు బాంబులు ధారగా పడుతున్నయ్.

పైలట్లు స్టీరింగ్ వీల్ ని గిరగిర త్రిప్పుతున్నారు. నాక గమనం మళ్ళింది.

విమానంలోంచి పడుతున్న బాంబులు నీళ్ళ పాలయి నయ్. విమానం వెళ్ళిపోయింది.

నీళ్ళలో బాంబులు పడేసరికి, నీళ్ళు నాకకు ఇంతా అంత ఎత్తున లేచిపడ్డయ్. ఆ కల్లోలానికి రేగిన అలల్లో నాక అటూ ఇటూ ఊగిసలాడింది.

డెక్ మీద సైనికుల్లో కొందరు పడిపోయారు, మరి కొందరు అటూ ఇటూ స్థానాలు మారారు.

మూడో విమానం నాకమీదకు వస్తోంది. అయితే ఈసారి విమానం చాలాదూరంలో ఉండంగానే నాక లోంచి ఒక్కుమ్మడిగా కాల్పులు జరిగినయ్.

ఆ దెబ్బకు ఆ విమానం ఆత్మరక్షణకోసం తన గమ నాన్ని మళ్ళించుకుని దూరంగా వెళ్ళిపోయింది.

ఈ దఫా నాలుగోవిమానం వస్తోంది, మొదటివిమానం అప్పుడే ఒక రౌండ్ కొట్టి, దాంతోబాటే వస్తున్నది. ఒక్కసారే రెండు విమానాలు దాడి జరపడానికి వస్తు న్నయ్.

"కుడివేపువారంతా ఒక విమానాన్ని, ఎడమవైపు వారంతా రెండోదాన్ని ఎదుర్కోండి!" అని అరిచాడు కెప్టెన్!

మొదటి విమానం వస్తున్నవైపే వున్నాడు రాజు. విమానంలోంచి వస్తున్న తూటాల్ని లక్ష్యపెట్టకుండా, తన గన్‌ని విమానంకేసే గురిపెట్టాడు. విమాన గమనంతో బాటు అతడి గన్ కూడా తిరుగుతోంది.

ధన్ ధన్ ధన్ మని రాజుచేతిలో మెషిన్‌గన్ విరామం లేకుండా ప్రేలింది. అతడి సాహసం ఫలించింది.

విమానంకి నిప్పంటుకుంది. నల్లని పొగను చిమ్ముతూ విమానం ముందుకుపోయింది. దెబ్బతిన్న పక్షిలా సముద్రంలో కూలిపోయింది.

"సెభాష్ రాజూ!" కెప్టెన్ కంఠం పెద్దగా వినిపించింది.

అంతలోనే నౌక అంతా ఒక్కసారే దద్దరిల్లింది. నాలుగో విమానంలోంచి దిగిన బాంబులు కొన్ని నౌకలో పడినయ్. పెద్దగా శబ్దంచేస్తూ అవి ప్రేలడమూ, ఆవైపు నౌకలో పెద్దపెద్ద చిల్లులు పడటమూ జరిగింది. అంతే కాదు. ఆ వైపున వున్న నావికులు ప్రాణాలు కోల్పోయి డెక్ నేలను కరుచుకుని వున్నారు.

వాళ్ళ శరీరాలనిండా తూట్లు పడినయ్! కొందరికి కాళ్ళూ, చేతులూ విరిగిపోయాయ్!

రాజు శరీరం గడ్డకట్టుకు పోయింది. తనా ప్లేన్‌ని కాల్చలేకపోయినట్టయితే, తనకీ అదే గతి పట్టివుండేది.

రాజు మళ్ళీ ఆకాశంలోకి చూశాడు. ఈ దఫాగూడా ఇంకో రెండు ప్లేన్‌లు వస్తున్నయ్. నౌక గమనాన్ని

మార్చినా, తప్పించుకోటానికి వీల్లేకుండా చెరో ప్రక్క నుంచి దూసుకువస్తున్నయ్!

నౌక గమనాన్ని మార్చకుండా సూటిగా ముందుకు పోతోంది. విమానంలోంచి బుల్లెట్స్ వచ్చి నౌకలో పడుతున్నయ్. అవి తగిలిన మనుష్యులు నేల కూలుతున్నారు. డెక్ మీద పడ్డ బుల్లెట్స్ దెబ్బకు చిల్లులు పడుతున్నయ్.

విమానాలు నౌక మీదకు రాబోతూండగానే, పైనుంచి బాంబులు పడసాగినయ్. ఒక వరుస డెక్ ఎడమభాగాన్ని కోసుకుపోతున్నాయ్. రెండో వరుస మరికొందర్ని బలి తీసుకుంది.

నౌక నీళ్ళలో ఎగసిపడింది. నౌక ముందుభాగంలో నీళ్ళలో ఉత్పాదన రేగింది. నౌకకంటె ఉవ్వెత్తుగా నీళ్లు పైకి లేచి మళ్ళీ పడిపోయాయి.

నౌకలో ఇంజన్ల మ్రోత ఆగిపోయింది. అందరికీ గుండె లాగిపోయినంత పనయింది. నౌక పని అయిపోయింది. అది యుద్ధానికి ఉద్దేశించిన నౌక కాదు. అందుకే తేలికగా దాని పని అయిపోయింది.

అందరూ దిగ్భ్రాంతులై చూస్తుంటే, రాజు, మైత్రా ఇద్దరూ తమకు దూరంగా వెళ్తూన్న విమానాలవైపుగా కాల్పులు సాగించారు.

ఆ రెండూ విమానాలు క్రమేపీ ఎత్తునించి దిగజారి సముద్రంలో పడిపోయినయ్. బురదలో పడుకుని మునిగి పోయే పందుల్లా నీళ్ళల్లో మునిగిపోయినయ్.

నాలుగో విమానం పలాయనం చిత్తగించింది.

## 5

"అందరూ లైఫ్ బెల్ట్స్ తగిలించుకోండి! ఓడ మునిగి పోతోంది!" కెప్టెన్ అరిచాడు మూడు నాలుగుసార్లు!

డెక్ నిండా బ్రతికున్న వారికంటే ఎక్కువ సంఖ్యలో శవాలు పడిఉన్నాయ్.

డెక్ మీద నావికులంతా మెషీన్ గన్స్‌ని వదిలేసి బోట్లను నీళ్ళ మీదకు దించే ప్రయత్నంలో మునిగి పోయారు.

ముందుగా పెద్ద సైజు మోటార్ బోటుని నీళ్ళల్లోకిజార విడిచారు. మంచి నీటి పీపాని దించారు తర్వాత. సముద్రం మీద ప్రయాణించేటప్పుడు ఆహారం లేకపోయినా ఎలాగో ఉండవచ్చు. కాని మంచి నీళ్ళు లేకపోతే మనుష్యులు బ్రతకలేరని నావికులకందరకూ ఉగ్గుబాలతో నేర్పిన విద్య!

మరో చిన్న బోటుని దింపారు. దాంట్లో మరో డ్రమ్ము త్రాగే నీటిని ఎక్కించారు. ఆ తర్వాత ఆహార పదార్థాలు రొట్టె, వెన్న, బీఫ్ ప్యాకెట్లూ, టిన్నులు తీసుకుని కొందరు బోట్లలోకి దిగారు.

జాన్సన్ సంగతి అప్పటికిగానీ గుర్తురాలేదు రాజుకు. కెప్టెన్ అరుస్తూన్నా వినకుండా, మెట్లుదిగి కాబిన్ గదు ల్లోకి పరుగెత్తాడు.

నాయర్ కళ్ళు తెరుచుకుని నిశ్చింతగా పడుకుని ఉన్నాడు. అతడిలో చలనం లేదు.

అతడి ముఖం మీదకు వంగి చూస్తున్నాడు జాన్సన్.

“జాన్సన్! నాయర్‌ని భుజాన వేసుకుని పరుగెత్తు! ఓడ మునిగిపోతోంది!” రాజు ఆదుర్దాగా అరిచాడు.

“నాయర్ చనిపోయాడు!” అంటూ జాన్సన్ దుప్పటి లాగి అతడి మీదుగా కప్పాడు పూర్తిగా.

రాజు వెనుకనే నడుస్తూ డెక్ మీదకు వచ్చాడు. త్రాటి నిచ్చెన మీదుగా ఇద్దరూ దిగి రెండో పడవలోకి దిగారు.

మోటార్ బోటుకీ రెండో పడవకీ పెద్ద త్రాడుతో ముడివేశారు. మోటార్‌బోట్ స్టార్ట్ అయింది, రెండో పడవను లాక్కెడుతూ.

మోటార్ బోటులో కెప్టెన్, ఇంకా పదిమంది నావికు లున్నారు. వాళ్ళలో పద్మనాభం గూడా ఉన్నాడు.

అతడు నవ్వుతూ కెప్టెన్‌తో కబుర్లు చెపుతున్నాడు. అతిభయానకమైన దాడికి గురై, ఓడ మునిగిపోయి, ప్రాణాలు అరచేతిలో పెట్టుకుని అందరూ బిక్క మొగా లతో కూర్చుంటే, పద్మనాభంకి ఇదేం పట్టినట్టులేదు! ఏదో పిక్నిక్‌కి వెళ్తున్నవాడిలా నవ్వుతూ మాట్లాడుతున్నాడు.

మహాసముద్రం మీద పడవలో ప్రయాణం అంటే మాటలు కాదు. తుఫాను వీచిందంటే, సుడిగాలిలో ఆకులాపడవ అల్లలాడిపోతుంది. అందులోని మనుషులు తలా ఒకదిక్కై అడ్రసు లేకుండా పోతారు.

అంతేకాదు. ఇంకో ప్రమాదం గూడా ఉంది. మూడు విమానాలు కూలిపోగా, నాలుగో విమానం పలాయనం చిత్తగించింది. అది మరికొన్ని విమానాల్ని వెంటపెట్టుకుని తిరిగి దాడి జరిపేందుకు రావచ్చు ఏ క్షణంలోనైనా!

నౌక క్రమేపీ నీళ్ళలోకి దిగిపోయింది. నీటి ఉపరితలం మీద ఇంకా మాస్ట్ మీది జెండా కనబడుతూనే వుంది.

వందగజాల దూరంలో ఆగి బోటుల్లో కూర్చుని నౌక పూర్తిగా మునిగిపోవటాన్ని కళ్ళారా చూసి, తర్వాత అందరూ బయలుదేరారు.

# 6

మోటార్ బోట్‌లో అందర్నీ సమావేశపరచి కెప్టెన్ ఏదో చర్చిస్తున్నాడు.

"మనకంటె ముందు వెళ్ళిన నౌక సురక్షితంగా గమ్యాన్ని చేరుకుంది. కానీ శత్రువిమానాలు మన ఉనికిని పసిగట్టాయంటే, ఎవరో శత్రుదేశపు గూఢచారులే మన కదలికల్ని తెలియజేసి వుండాలి. లేదా మనలోనే ఎవరో రహస్య సమాచారాన్ని చేరవేసి వుండాలి" అన్నాడు కెప్టెన్.

"అందుకు సందేహం లేదు సార్! మనలోనే ఒకరు శత్రుదేశానికి సమాచారాన్ని అందించారు. అందుకు సాక్ష్యం ఈ ట్రాన్స్మిటరే! ఇది చైనా తయారీ!" అంటూ పద్మనాభం ట్రాన్సిస్టర్ సైజులో ట్రాన్స్మిటర్ అందరి మధ్యలో ఉంచాడు.

"ఎక్కడ దొరికింది ఇది?" అందరూ ఆశ్చర్యంగా అడిగారు.

"ఇంకెక్కడ? జాన్సన్ గదిలోనే దొరికింది!" కొందరు నావికులు జాన్సన్ వంక చూసి పళ్ళు కొరికారు. మరికొందరు జాన్సన్‌ని అక్కడి కక్కడే కాల్చి చంపుతామని మెషీన్ గన్స్ తీశారు.

వాళ్ళను కెప్టెన్ వారించాడు. "తీరం చేరంగానే, అతడ్ని కోర్ట్ మార్షల్‌లో విచారిస్తాం! మీరు ఆవేశపడి హంతకులు కాకండి!" అన్నాడు.

"జాన్సన్!" అని అరిచాడు కెప్టెన్.

"యస్ సార్!" జాన్సన్ పడవ అంచుకు వెళ్ళి నిలబడ్డాడు.

"ఈ రహస్య ట్రాన్స్మిటర్ నీ గదిలో దొరికింది! దీని ద్వారా నీవే శత్రువులకు మన నౌక గురించి సమాచారం అందించావని నీపై ఆరోపణ చేయబడింది. దీనికి నీ సమాధానం ఏమిటి?"

జాన్సన్ నోటంట మాట రాలేదు! ఒక్క క్షణం అలానే చూస్తూ నిలబడి పోయాడు.

"ఎవరు తీశారు నా గదిలోంచి దాన్ని?" అనడిగాడు చివరకు.

"పద్మనాభం!"

"వాడే శత్రుదేశానికి సమాచారం అందించాడు. నాకూ వాడికీ మధ్య వైరాన్ని పురస్కరించుకుని, తను చేసిన ద్రోహాన్ని నా మీదకు నెడుతున్నాడు! వాడ్ని, వాడ్ని నిలువునా చీల్చినా పాపం లేదు!" అంటూ జాన్సన్ పళ్ళు కొరుకుతూ, వరండాలోంచి దూకబోయాడు.

సమయానికి రాజు వచ్చి అతడ్ని పట్టుకుని వారించాడు.

"తీరానికి చేరాక నీపై విచారణ జరుగుతుంది!"అంటూ కెప్టెన్ వెనక్కి వెళ్ళి తన స్థానంలో కూర్చున్నాడు.

పద్మనాభం మీసాలు మెలిత్రిప్పుతూ చూస్తున్నాడు జాన్సన్ వేపు!

మొత్తానికి పద్మనాభం తన యుక్తిని ఉపయోగించి జాన్సన్‌పై కక్ష తీర్చుకున్నాడు, అనుకున్నాడు రాజు.

సూర్యుడు పశ్చిమానికి జారుతున్నాడు. బోటుల్లోని వ్యక్తులు ఎవరికి వారే ఆలోచనల్లో మునిగిపోయారు.

"చీకటి పడితే విమానాలు రావుగదూ?" రాజు నిశ్శబ్దాన్ని చీలుస్తూ అడిగాడు.

ఎవరూ అతడి ప్రశ్నకు బదులు చెప్పలేదు.

ఆ పడవలో రాజు, జాన్సన్, మైత్రా, నారాయణన్, కాంతారావు ఉన్నారు. పడవ సగం భాగం అంతా నీళ్ళ డ్రమ్ములతోనూ ఆహారపు ప్యాకెట్లూ, త్రాళ్ళ మోపుల తోనూ, టార్పాలిన్ లతోనూ నిండి వుంది.

"మనం ఏ ప్రాంతంలో వున్నామో గూడా తెలియటం లేదే!" మైత్రా అన్నాడు కాసేపాగి.

వైర్ లెస్ ఆపరేటర్లు ఇద్దరూ విమాన దాడిలో చని పోయారు. కనుకనే మైత్రా ప్రశ్నకు సమాధానం రాలేదు.

కూర్చున్న చోటనే కాళ్ళు బారజాపుకుని నారా యణన్, మైత్రా కళ్ళు మూసుకుని నిద్రపోవటానికి యత్ని స్తున్నారు.

జాన్సన్ రాజు వంక చూశాడు. "నీవూ నిద్దరపో రాదూ? పొద్దుపోతే చలికి నిద్దర పట్టదు!"

"అందరూ నిద్రపోతే ఎవరు వాచ్ చేస్తారు?" రాజు ప్రశ్నించాడు.

"నాకు నిద్ర వచ్చేలా లేదు! నేను 'వాచ్' చేస్తుం టాను నీవు నిద్రపో!"

అక్కడున్న అయిదుగురిలోనూ రాజే సీనియర్. కనుక అతడే ఆజ్ఞలు జారీ చేయాలి.

"విమానాలు కూల్చి అలిసిపోయినట్లున్నావ్! నీకు విశ్రాంతి అవసరం!" పసిబిడ్డని నిద్రకు జోగాడించేవాడిలా అన్నాడు జాన్సన్.

"సరే! నీకు నిద్ర వచ్చినప్పుడు నన్ను లేపు!" అంటూ రాజు మరో మూల చోటు చేసుకుని టార్పాలిన్ మీద వాలిపోయాడు.

కళ్ళు మూసుకుంటే విమానాలు తమ నౌక మీదకు దూసుకు వస్తున్న దృశ్యమూ, అవి తమ కాల్పులకు గురై, సముద్రంలో కూలిపోవడం, మునిగిపోతున్న నౌక ఇదే మెదిలినయ్.

మెల్లగా నిద్రలోకి జారుకొన్నాడు రాజు.

## 7

తూర్పు రేఖలు తెల్లబారుతున్నయ్. రాజు కళ్ళు తెరిచాడు. తన ప్రక్కనే పడుకుని వున్న మైత్రా, నారాయణన్, కాంతారావులు ఇంకా నిద్రపోతూనే వున్నారు.

అక్కడి వాతావరణంలో ఏదో వెలితి కనుపించింది. రాజు ఉలిక్కిపడి లేచాడు.

తమ బోటుని లాక్కెళుతున్న మోటార్‌బోట్ కనిపించలేదు.

"మోటార్‌బోట్ ఏమయింది?" జాన్సన్ వంక చూస్తూ అడిగాడు రాజు.

జాన్సన్ టార్పాలిన్ పొడవాటి కొయ్యకు కడుతున్నాడు తెరచాప తయారు చేయాలని.

"రాత్రివేళ మోటార్ బోట్‌కీ మన బోట్‌కీ కట్టి వున్న త్రాడు తెగిపోయినట్టుంది. కన్ను పొడుచుకున్నా కనపడని కటిక చీకటిలో మోటార్‌బోట్ వెళ్ళిపోయిన చాలాసేపటికిగానీ ఆ విషయం తెలుసుకోలేకపోయాను" అన్నాడు జాన్సన్ తన పని చేసుకుంటూనే.

"త్రాడు తెగిపోయిందా? లేక ఎవరైనా తెంచారా?"

"అదీ జరిగి వుండచ్చు! ఆ పద్మనాభంగాడి పనే అయి వుంటుంది ఇది. కావాలని తాడు త్రెంచి వుంటాడు. పైగా కోర్ట్‌మార్షల్‌ని తప్పించుకోవటానికి జాన్సనే ఈ పని చేశాడని ప్రచారం చేస్తాడు గూడాను!"

"నిజమే! అసలు వాడ్ని అప్పుడే చంపేసి వుంటే పీడా విరగడైపోయి వుండేది. మన నౌక గురించి శత్రువులకు తెలిసేదీ కాదు. విమానాల దాడి వుండేదీ కాదు, మన నౌక మునిగి వుండేది కాదు. ఇప్పుడు వీటన్నిటికీ కారణం జాన్సన్ అని ఋజువు చేయటానికి ప్రయత్నిస్తాడు వాడు!" అన్నాడు రాజు బాధగా.

జాన్సన్ మాట్లాడలేదు.

అయితే తమ బృందం బంగళాఖాతంలో, నడి సముద్రంలో నిలిచిపోయిందన్న మాట అనుకున్నాడు రాజు. చిన్న పడవలో అయిదుగురు వ్యక్తులు, కేవలం పది గ్యాలన్ల నీరుతో, ఇరవయ్ అయిదు పౌన్ల ఆహార పదార్థాలతో ఎన్నాళ్ళు గడపగలరు?

పైగా శత్రువిమానాలు మళ్ళీ దాడి చేయవచ్చు లేదా పెనుతుఫాను రేగవచ్చు. ఎండవేడి నుంచి రక్షణ లేని పడవలో, ఆకలి దప్పులతో తాము దిక్కులేని చావు చావాల్సిందేనా?

లోగడ కొందరి అనుభవాల్ని విన్నాడు తను. నీడ దొరకని పడవలో నిస్సహాయంగా నావికులు దాహంతో నోరెండి, నాలుక పిడచగట్టుకుపోతుంటే, చావు కోసం ఎదురు చూస్తూ మతి చెడిపోయినవారి కథలు వినే వున్నాడు.

అయినా రాజు ధైర్యంగా వుండటానికి యత్నించాడు. నిజానికి నిన్న మధ్యాహ్నం నుంచి తను ఆహారం తీసుకోలేదు. నీళ్లు అసలే త్రాగలేదు. చావు బ్రతుకుల మధ్య పోరాటంలో ఆకలి దప్పుల విషయమే మరచిపోయాడు తను.

ఈ భయంకర ప్రయాణం ఎన్నాళ్ళు సాగాలో! లేక ఈ లోపలే శత్రువిమానాలు వచ్చి, బాంబుల వర్షం కురిపించి, తామందర్నీ త్వరితంగా యమపురికి పంపవచ్చు.

తూర్పు దిక్కున అప్పుడే సూర్యుడుదయిస్తున్నాడు. కాంతినీ, వేడినీ కలిగించే అగ్నిగోళం సముద్రంలోంచి పైకి వస్తున్నట్టుగా వుంది సూర్యోదయం.

ఇంకా ఉన్నకొద్దీ వేడి ఎక్కుతుంది వాతావరణం. ఇప్పుడు వీచే చల్లగాలులు మాయమవుతయ్.

టార్పోలిన్‌తో జాన్సన్ తెరచాపను తయారుచేశాడు. తెరచాప స్తంభాన్ని నిలబెట్టాడు. రెండు వైపులా త్రాళ్లు లాగి బలంగా ముడివేశాడు.

"ఈ తెరచాప మూలంగా శత్రువులు మనల్ని తేలికగా గుర్తించరూ?" రాజు అడిగాడు.

"వాళ్ళ గురించి ఆలోచించకు! ఈ తెరచాప వుంటే, గాలి వానలో మనం త్వరగా ఏదైనా తీరాన్ని చేరుకోవచ్చు!"

అప్పటికి నారాయణన్, మైత్రా, కాంతారావు కూడా మేల్కొన్నారు.

నారాయణన్ నాలుగు వైపులా కలయ జూశాడు. "మోటార్‌బోట్ ఎక్కడ?" అని అడిగాడు ఆశ్చర్యంగా.

జరిగింది వివరించి చెప్పాడు రాజు. విని ముగ్గురూ నోరెల్లబెట్టారు.

# 8

"మన పరిస్థితి తల్చుకుంటే నా కడుపులో అగ్ని రగులుకుంటోంది! కాస్త ఏదైనా ఆహారం వెయ్యి రాజూ! ఆహార పదార్థాలు లేవన్న సంగతి తల్చుకుంటేనే, ఆకలి

అతిదారుణంగా వేస్తున్నది!'' కాంతారావు అలమటించాడు.

రాజు ఫుడ్ ప్యాకెట్ ఒకదాన్ని విప్పాడు. అందులోని బిస్కట్లూ, చాకెట్లూ, బీఫ్‌ని అయిదుగురికీ పంచాడు. తలా ఒక కప్పు డ్రమ్‌లోని నీళ్ళు అందరికీ ఇచ్చాడు.

చేతి గడియారం వంక చూస్తూ, ''మధ్యాహ్నం ఒంటి గంటవరకూ మళ్ళీ నీళ్ళుగానీ, ఆహారంగానీ అడగకూడదు'' అన్నాడు రాజు.

అందరికన్నా ముందు కాంతారావే తినేశాడు తన వంతు ఆహారాన్ని.

రాజు అతడి ముఖంలోకి చూశాడు. ''నీ రేషన్ ఒక డొక్కలోకి కూడ రాలేదనుకుంటాను!''

కాంతారావు అవునన్నట్టుగా తలూపాడు.

కాంతారావు అందరిలోకి లావుపాటి మనిషి. అతడ్ని చూసి హేళనగా నవ్వాడు నారాయణన్.

''ఒరేయ్! సైన్సు ఏం చెబుతుందో తెలుసా? పది రోజులు ఆహారం లేకుండా వుండగలిగిన వ్యక్తిలో అసలు ఆకలనేది లేకుండా చచ్చిపోతుందట. అప్పటికీ వాడు బ్రతికే వుంటే, అతడి శరీరం అతడి దేహంలోని కండల్ని కరిగించి ప్రాణాల్ని నిలుపుతుందట. కండలు కూడ కరిగిపోయాక, శరీరం దేహంలోని రక్తాన్ని పీల్చుకుని ఆయుస్సు నిలబెడుతుందట. అప్పటికి అతడెలా వుంటాడో తెలుసా? అస్థిపంజరం మీద చర్మాన్ని కప్పినట్టుగా, ఎముకలూ, చర్మం తప్ప ఒంట్లో వేరే ఏమీ వుండదు. నీ ఒంట్లో కండ బాగా వుంది. ఈ సముద్రం మీద నీవు అందరికన్నా చివరగా ఛస్తావులే!'' నారాయణన్ తన లెక్చరు ముగించి వికటంగా నవ్వాడు మరోసారి.

"నారాయణన్। నీవు నోరు మూసుకో!" రాజు కోపంగా అరిచాడు.

కాంతారావు పిడికిళ్ళు బిగించి నారాయణన్ మీదకు పోబోయాడు.

రాజు అతడ్ని పట్టుకుని ఆపాడు.

"నీ వెధవ విట్స్ వేయటానికి ఇదా సమయం నారాయణన్!" రాజు మందలించాడు.

"ఏదో సరదాగా జోక్స్ వేసి, అందర్నీ ఉల్లాస పరుస్తున్నాను అదీ తప్పా? మాట్లాడకుండా కూర్చుని ఈ భీకర వాతావరణం చూస్తుంటే పదిరోజులకు చచ్చేవాడు ఇప్పుడే ఠపీమని చస్తాడు."

నారాయణన్ తల క్రింద అరచేతులు పెట్టుకుని కాళ్ళు బారజాపి మళ్ళీ పడుకున్నాడు.

అందరి మనసుల్లో నారాయణన్ మాటలే ప్రతిధ్వనిస్తున్నాయ్. అతడి మాటలు ఎంత ధైర్యస్థుడినయినా పిరికి వాడ్ని చేసేలా వున్నయ్.

కాంతారావు అందర్నీ నమిలి మ్రింగేసేవాడిలా చూస్తున్నాడు. మంచినీటి పీపా వంక చూస్తూ పెదవుల్ని నాలికతో తడుముకుని తడి చేసుకుంటున్నాడు.

జాన్సన్ ఒక్కడే కూర్చుని తెడ్లు వేస్తున్నాడు.

# 9

ఆరోజు, మర్నాడు గూడ శత్రువిమానాలు రాలేదు. తెరచాప కట్టడంవల్లనూ, అందరూ వంతుల ప్రకారం తెడ్లు వేయడం వల్లనూ పడవ ముందుకు సాగుతోంది. అయినా ప్రయాణం రోజు రోజుకు అయిదారు మైళ్ళకన్న మించటం లేదు.

జాన్సన్ అంచెనా ప్రకారం తాము ఇంకా వంద మైళ్లు పైగా ప్రయత్నిస్తేగానీ తీరాన్ని చేరలేరు. శాంతి సమయంలో అయితే బంగాళాఖాతంలో ఏవో ప్రయాణపు నౌకలు గానీ, సరకుల్ని చేరవేసే రవాణా నౌకలు గానీ ఎదురుపడి వుండేవే! కానీ యుద్ధ సమయం కావటంవలన నౌకల రాకపోకలు బంద్ అయినయ్.

మధ్య మధ్యలో గాలి ఉధృతంగా వీచేది. ఆ గాలికి అలలు ఎగిరెగిరి పడేవి. పడవలో నీళ్లు చేరుకునేవి. వాటిని తోడి సముద్రంలో పారబోయడం పెద్ద పని అయింది వారికి. గాలి ఎప్పుడు తగ్గిపోతుందా, ఎప్పుడు తాము విశ్రాంతిగా కూర్చుంటామా అని ఆశగా ఆకాశంలోకి చూసేవారు నావికులు.

గాలి తగ్గేసరికి సూర్యతాపం తీవ్రం అయేది. చెమట ఒంటిమీద యూనిఫారం షర్ట్ విప్పేసి అర్ధనగ్నంగా కూర్చునేవారు, తిరిగీ చెమట పట్టేదాకా.

ఎండ తీవ్రత పెరిగినకొద్దీ దాహం ఎక్కువ అయ్యేది. డ్రమ్ములో నీళ్ళు చూసుకుంటూ కప్పు, అరకప్పు త్రాగే వారు అందరూ.

రాజు ఆహార పదార్థాలనూ, త్రాగే నీటినీ పొదుపరిగా పంచసాగాడు. ఇదివరకు అయిదు గంటలకోసారి తినే ఆహారాన్ని ఇప్పుడు ఎనిమిది గంటలకోసారి ఇవ్వసాగాడు. జాన్సన్, రాజు నీళ్ళు చాలా మితంగా త్రాగి, చాల జాగ్రత్తగా వాడుతున్నారు.

కాంతారావుకి ఎన్ని నీళ్ళు త్రాగినా దాహం తీరటం లేదు. చివరకు బోటులోంచి వంగి సముద్రపు నీళ్ళను దోసిళ్ళతో అందుకుని త్రాగటం మొదలెట్టాడు. ఉప్పునీరు

త్రాగటం మూలాన అతడి నోరు ఇంకా త్వరగా తడి ఆరి పోతోంది.

నారాయణన్ కలుగజేసుకుని, కాంతారావు దోసిలి లోని నీళ్ళను చిందగొట్టేశాడు. కోపంతో పళ్ళు కొరు కుతూ, పిడికిళ్ళు బిగించి కాంతారావు నారాయణన్ మీదకు వెళ్ళాడు. నారాయణన్ ప్రక్కకు తప్పు కున్నాడు.

కాంతారావు బోర్లా పడిపోయాడు పడవలో. ముఖా నికి దెబ్బ తగలటంతో పెద్దగా అరిచాడు బాధతో.

ఆ రాత్రి నిద్రలోగూడ కాంతారావు "దాహం! దాహం! నీళ్ళివ్వండి! చచ్చిపోతున్నాను!" అని పలవ రించాడు.

రాజు అతడి నోటికి కప్పు సగానికి నీళ్ళను అందిం చాడు.

మరి రెండు రోజులు గడిచినయ్. తీరం జాడ లేదు. తమను రక్షించగల నౌకగానీ, భక్షించివేసే శత్రు విమా నాలు గానీ తటస్థపడలేదు వారికి.

అయితే గుండె లవిసిపోయే మరో భయానక దృశ్యం ఎదురయింది వారికి.

తమ పడవలాంటి పడవే మరోటి కనుపించింది సము ద్రంలో గాలికి అటూ ఇటూ వూగుతూ.

అందులో ఒకే వ్యక్తి వున్నాడు. యూనిఫాంనిబట్టి అతడూ నావికుడే అని అనుకోవాలి.

ఆ వ్యక్తి పడవలో వెల్లకిలా పడి వున్నాడు. అతడి ప్రాణాలు ఎప్పుడో అనంత వాయువుల్లో కలిసి పోయాయి.

జాన్సన్ తమ పడవని ఆ పడవ దగ్గరగా పోనిచ్చాడు. అందులో త్రాగటానికి మంచినీళ్ళుగానీ, తినటానికి ఆహార పదార్థాలు గానీ దొరుకుతాయేమో అని ఆశగా అందరూ పడవలోకే చూశారు.

చనిపోయిన వ్యక్తి గురించి ఎవరూ పట్టించుకునే స్థితిలో లేరు! ఆ వ్యక్తి శరీరం నల్లగా అయిపోయి, ఉబికి వుంది.

పడవ దగ్గరయ్యేకొద్దీ ఆ శవం నుంచి దుర్గంధం రాసా గింది. కాంతారావు నోటికీ, ముక్కుకీ గుడ్డను అదుము కున్నాడు.

జాన్సన్ బోటులోంచి నీళ్ళల్లోకి దూకాడు. ఈదు కుంటూ వెళ్ళి రెండో బోటులోకి ఎక్కాడు. రెండో చేత్తో ముక్కు మూసుకుని, పడవలో అంతా వెదికాడు.

ఆ పడవలో మంచినీరుకానీ, ఆహారపదార్థాలూ కానీ ఏవీ లేవు.

జాన్సన్ ఆకాశంకేసి చూస్తూ బైబిల్‌లోని వాక్యా లేవో ఉచ్చరించాడు. ఆ తర్వాత ఆ శవాన్ని బోటు లోంచి ఎత్తి నీళ్ళలోకి జారవిడిచాడు. అతడి దేహానికి ఏదో బరువైనది తగిలించటంతో, ఆ శవం నీళ్ళలో మునిగి పోయింది.

జాన్సన్ ఈదుకుంటూ తిరిగి తమ పడవలోకి వచ్చే శాడు.

కాంతారావు ఇంకా ఆ ఖాళీ పడవ వంకే కన్నార్ప కుండా చూస్తున్నాడు, ఇంకా అక్కడ శవం వున్నట్టుగా.

నారాయణన్ తన వంతు కప్పు నీళ్ళను కాంతారావు కియ్యబోయాడు.

కాంతారావు అతడి చేతిమీద కొట్టాడు పిచ్చిగా అరుస్తూ. ఆ రాత్రంతా కూడా కాంతారావు ఏదేదో పిచ్చిగా వాగుతూనే వున్నాడు.

# 10

జాన్సన్, రాజు ఇద్దరూ కాంతారావుని కనిపెట్టుకుని కూర్చున్నారు. గాలి వాలులో నావ తెడ్లు వేయకుండానే సాగిపోతోంది.

కాంతారావు కళ్ళు మూసుకుని పడుకుని ఉన్నాడు. అతడిలో ఇంకా పసితనపు ఛాయలు మాసిపోలేదు. గడ్డం ఇంకా నూనూగుగానే ఉంది. అతడి స్థితి చూస్తుంటే అందరికీ హృదయం తరుక్కుపోతున్నది.

బోటులో ఇప్పటికి ఆరురోజులు గడిచినయ్.

కాంతారావు బాధగా మూలిగాడు. పడుకున్న చోటు నుంచి కదిలాడు.

జాన్సన్ కప్పుతో నీళ్ళు అందించబోయాడు. కాంతారావు కళ్ళల్లో కోపం తాండవిస్తోంది. విసురుగా జాన్సన్ చేతిని విదిలించి కొట్టాడు. అతడి చేతిలోని నీళ్ళ కప్పు పడవలో ఒక మూలగా వెళ్ళి పడింది.

జాన్సన్ కోపంగా కాంతారావు దవడ మీదకొట్టాడు.

కాంతారావు తిరగబడ్డాడు. పిచ్చివాడికి బలం ఎక్కువంటారు! ఏనుబోతులాంటి పద్మనాభంని ఎలుకలా విదిలించి కొట్టిన జాన్సన్‌తోనే కలియబడ్డాడు కాంతారావు.

వారిద్దరి పెనుగులాడటలో పడవ అటూ ఇటూ ఊగిపోతోంది. రాజు, మైత్రా, నారాయణన్ ముగ్గురూ కలిసి ప్రయత్నించినా వారిద్దర్నీ విడదీయలేకపోయారు.

పైగా అందరూ కుమ్ములాడుకుంటుంటే, పడవ సముద్రంలో ఊగులాడుతూ తిరగబడ సాగింది.

నారాయణన్ ఏదో గుర్తుకు వచ్చిన వాడిలా నీళ్ళ డ్రమ్ము దగ్గరకు గబగబ వెళ్ళాడు. డ్రమ్ముచాటునే వున్న కత్తిని తీసుకున్నాడు.

కత్తిని చేతబుచ్చుకుని కాంతారావుని సమీపించాడు, వెనుక వైపునించి.

అతడి ఉద్దేశ్యాన్ని రాజు ముందే గ్రహించాడు. "నారాయణన్! ఆగు! ఆగు!" అని అరిచాడు.

అప్పటికే నారాయణన్ చేతిలో తళతళ లాడే కత్తి కాంతారావు డొక్కల్లో బలంగా దిగబడింది.

"అమ్మో!" అంటూ కాంతారావు ఒరిగిపోయాడు, జాన్సన్ చేతుల్లోకి.

రాజు వెర్రిగా చూస్తూ నిలబడి పోయాడు. మైత్రా గూడ నారాయణన్‌ని హంతకుని చూస్తున్నట్టుగా భయ భ్రాంతులతో చూస్తున్నాడు.

కాంతారావు గాయంలోంచి కారిన రక్తంతో పడవలో అడుగుభాగం అంతా ఎర్రబడింది.

నారాయణన్ బొమ్మలాగు నిలిచిపోయాడు. అతడి కళ్ళల్లో నీళ్ళు తిరిగినయ్. అతడి ముఖం జేవురించింది. "అతడ్ని కంట్రోలు చేయటం మనకు సాధ్యం కాదు. అందుకే తప్పనిసరి అయింది!" అని గొణిగాడు.

"అవును! అంతకన్న గత్యంతరం లేదు!" అన్నాడు జాన్సన్ నెమ్మదిగా.

సూర్యాస్తమయం వేళ కాంతారావుని సముద్ర గర్భంలో సమాధి చేశారు.

రాజుకి ఆ రాత్రి కంటిమీద కునుకు లేదు. మనసు అంతా అల్లకల్లోలంగా ఉంది. నోరు పిడచకట్టుకు పోతోంది. పడవలో నీరు దాదాపు అయిపోయింది.

"మనందరి చావులూ ఒకేరీతిలో రాసి ఉన్నయ్. కాకపోతే ఒకరు ముందూ, మరొకరు వెనుకా! అంతే!... ఈ పరిస్థితుల్లో ఎవరికైనా మతి చెడటం ఖాయం!" అన్నాడు రాజు శూన్యంలోకి చూస్తూ.

# 11

ఇంకా చీకటి పూర్తిగా తొలగిపోలేదు. రాజు కళ్ళు తెరిచాడు. అతడి దేహంమీద టార్పాలిన్ కప్పారు ఎవరో.

రాజు లేచి కూర్చున్నాడు. జాన్సన్ అతడికి ప్రక్కనే వచ్చి కూర్చున్నాడు.

"ఎలా వుంది ఇప్పుడు!" అని అడిగాడు జాన్సన్.

"కొంచెం నయమే!"

"గత ఎనిమిది గంటలనుంచి నీవు మాంచి నిద్రతీశావ్! నీ వైఖరి చూసి నాకే భయంవేసింది. ఆ నిద్ర పోకపోతే మాత్రం నీవూ కాంతారావులా అయిపోయి వుండేవాడివి!"

"నేనంత పిరికివాడ్ని కాను!" రాజు మొండిగా పలికాడు.

జాన్సన్ ఆప్యాయంగా రాజు వీపు నిమిరాడు, చిఱునవ్వు నవ్వుతూ.

రాజుకి ప్రక్కగా నారాయణన్ ఇంకా నిద్ర పోతున్నాడు.

అందరిముఖాలూ పీక్కుపోయాయి. కళ్ళు గుంటలు పడ్డాయి. ఎముకలు పొడుచుకు వస్తున్నయ్, చర్మాన్ని

నెట్టుకుని. అసిపంజరంమీద గుడ్డ కప్పినట్టుగా, వ్రేలాడుతున్నయ్ అందరి ఒంటిమీది దుస్తులు!

తెల్లవారుజామున కొద్దిగా వర్షం పడింది. డ్రమ్ము మూత తీసి వుంచటంవల్ల అందులో కొంచెంగా వాన నీరు నిలిచింది. జాన్సన్ టార్పాలిన్ని పడవమీద గుంటగా పరిచాడు. పడవలో కురిసిన వర్షపునీరు టార్పాలిన్ మీద ప్రోగయింది.

దేవుడి దయవలన ఆ నీళ్ళన్నీ తమకు మరో రెండు రోజులపాటు త్రాగేందుకు సరిపోతయ్!

గటగట మూడుకప్పుల నీళ్ళు త్రాగేశాడు రాజు. పడవలో బిస్కట్లు, చాక్లెట్లూ మరి రెండురోజులకు సరిపోయేలా వున్నయ్. తమ రేషన్ని సగానికి తగ్గించుకుంటే, నాలుగురోజులు వస్తుంది ఆ ఆహారం.

జాన్సన్ చాంతాడుని కోసి, పురివిప్పి సన్నని త్రాడుగా చేశాడు. దానికో కొక్కెన్ని తయారుచేసి, చేపలు పట్టటానికి యత్నించసాగాడు.

ఈ ప్రయాణంలో నిద్రపోకుండా, క్షణం విశ్రాంతి తీసుకోకుండా, ఎప్పుడు ఏదో ఒకపని చేస్తూవున్నది జాన్సనే! అతడి జాగరూకతే లేకపోతే తామందరూ ఎప్పుడో సాగరగర్భంలో సమాధి అయిపోయేవారే!

చేపమాంసం, బిస్కెట్లూ తిని, నీళ్లు త్రాగాడు రాజు. దేహానికి కొంత సత్తువ వచ్చినట్టుగా వుంది.

తీరం కనుపించని సముద్రంమీదకు చూస్తూ కూర్చున్నాడు రాజు.

ఉన్నట్టుండి రాజు పడవంతా కలయజూశాడు. పడవలో జాన్సన్, తనూ, నారాయణన్ మాత్రమే వున్నారు.

"మైత్రా ఎక్కడ?" రాజు అడిగాడు.

"వెళ్ళిపోయాడు!"

"వెళ్ళిపోయాడా? ఎక్కడకు?"

"ఈ హింస భరించలేక మైత్రా అర్ధరాత్రివేళ పడవ లోంచి దూకేశాడు సముద్రంలోకి!" నారాయణన్ బదులు చెప్పాడు.

రాజు ఇద్దరి వంకా అనుమానంగా చూశాడు.

"నిజమేనా ఇది? లేక కాంతారావుకి మల్లే, అతడ్నీ హత్య చేశారా?"

"లేదు నిజమే! నిన్నంతా అతడూ నీకన్న ఎక్కువగా పలవరించాడు."

"ఈ శుభవార్త చెప్పటానికేనా నన్ను లేపారు!" రాజు కోపంగా చూశాడు.

"అసలే నీరసంగా వున్నావు. ఎక్కువగా మాట్లాడకు!" అన్నాడు నారాయణన్.

"ఏం మాట్లాడితే? అంతగా అయితే నేనూ ఛస్తాను! అంతేగా?"

"నీవు చావటానికి వీల్లేదు! నీకు ఆకలవుతే నా కండల్ని చీల్చి ఇస్తాను తిను! దాహమయితే నా రక్తాన్నిస్తాను త్రాగు!" జాన్సన్ ఆవేశంగా అన్నాడు.

"నాకవేం అక్కర్లేదు! నా మానాన నన్ను నిద్ర పోనీయండి!"

"వద్దు! రాజూ! నిన్ను ఆవహించేది నిద్ర కాదు. 'కోమా'! నిస్సత్తువ ఎక్కువైనకొద్దీ, క్రమేపీ స్పృహ కోల్పోతావ్! అందుకే నీవు నిద్రపోవద్దు. ఒకసారే శాశ్వత నిద్రలోకి జారుకుంటావ్ 'కోమా'లో!"

రాజుకి కళ్ళు మూతలు పడుతున్నయ్. అతడ్ని కుదించి ఊపాడు జాన్సన్. సముద్రపు నీటితో అతడి కళ్ళను కడిగాడు.

రాజుకి పూర్తిగా మెలకువ వచ్చింది. కళ్ళు తెరచి కూర్చుని ఉలిక్కిపడ్డాడు.

## 12

సుదూరంలో అతడికి తీరంలాంటిది కనుపించింది. కొబ్బరిచెట్లూ, వాటి మధ్యలో చిన్నకుటీరం వున్నయ్.

తను పగటి కలలు కనటం లేదుగదా అని కళ్ళు నులుముకుని చూశాడు రాజు.

ఎందుకనంటే ప్రస్తుత పరిస్థితిలో ఏది కలో, ఏది వాస్తవమో తెలీటంలేదు.

రాజు మిగతా ఇద్దరివంకా చూశాడు. వాళ్ళూ అటు కేసే చూస్తున్నారు, కళ్ళు నులుముకుని మరీ!

మరుక్షణంలో ముగురిముఖాల్లోనూ సంతోషం వెలిసింది.

ఒకర్నొకరు అభినందించుకుంటూ, బోటు అదిరిపోయేలా చిందులు త్రొక్కారు.

తమ బొందిలో ఇంకా ప్రాణం వుండగానే, తాము ఒడ్డుకి చేరగలుగుతున్నారు.

సంతోషంతో గబగబ తెడ్లు వేశారు మిత్రులు ముగ్గురూ! పడవ తీరాన్ని చేరుకుంది.

బంగాళాఖాతంలో బంగ్లాదేశ్ కి దూరంగా అదో చిన్న దీవి. దాని విస్తీర్ణం అంతా ఒక చదరపు మైలుకన్న వుండదు.

తీరం అంతా కొబ్బరి చెట్లున్నయ్. ఆ చెట్ల మధ్యలో చిన్న సరస్సు వుంది. దాని ఒడ్డునే కుటీరం వుంది.

పడవలోంచి మోకాలిలోతు నీళ్ళలోకి దూకారు రాజు, జాన్సన్, నారాయణన్! పడవకు లంగరువేసి, ఇసుకలో పరుగెత్తారు, చేతులు, చేతులు పట్టుకుని.

కుటీరం తలుపు తెరిచేవుంది. కానీ లోపల ఎవరూ లేరు!

కానీ స్టవ్ మీద టీ మరుగుతోంది. టేబుల్ మీద ఆహారపదార్థాలు పరిచివున్నయ్.

"ఈ ఇంట్లో ఎవరో వున్నారు. మనల్ని చూసి వాళ్ళెవరోగానీ దాక్కున్నారు!" అన్నాడు రాజు.

"హుం! వాళ్ళ ఖర్మ అది! ముందు మనం కడుపారా ఈ ఆహారాన్ని తినేద్దాం! తర్వాత సంగతి తరువాత ఆలోచిద్దాం!" అన్నాడు నారాయణన్.

మరుక్షణం ముగ్గురూ టేబుల్ మీదకు దాడి చేశారు. రోమన్ సామ్రాజ్యాధిపతులు 'ఎరీనా' లో కొద్ది ఆహారాన్ని వుంచి, దాని మీదకు వారంరోజులనుంచి ఆహారం లేకుండా మాడిపోయే బానిసలిద్దర్ని వదిలేవారట! ఆ పిడికెడు ఆహారంకోసం ఆ ఇద్దరూ ఆగర్భశత్రువుల్లా పోట్లాడుకునేవారట.

అదేవేగంతో ముగ్గురూ టేబుల్ మీది ఆహారాన్ని తినేశారు. కడుపారా తియ్యని నీళ్ళు త్రాగారు. స్టౌమీది టీ త్రాగుతూ విందు చేసుకున్నారు.

మరి కాస్సేపటికి వాళ్ళు కర్తవ్యం గురించి ఆలోచించసాగారు.

ఎక్కడ్నుంచో ట్రాన్సిస్టరులోంచి పాకిస్థాన్ సందేశాలు వస్తున్నయ్.

జాన్సన్, రాజు నారాయణన్ ముగ్గురూ ఆ ఇంటి యజమానికోసం ఇంటిచుట్టూ ప్రదక్షిణం చేసివచ్చారు.

వాళ్ళ కంటికి ఎవరూ కనిపించలేదు. తిరిగి ఇంట్లోకి వచ్చారు.

"ఆఁ! వాడెవడైతే మనకేం! హాయిగా మనం నిద్ర పోదాం!" అన్నాడు నారాయణన్.

"మరీ అంత వెర్రిగా ఆలోచించకు! ఇందులో వున్నది మన శత్రువో, మిత్రుడో తెలుసుకోకుండా ఎలాగ?" అన్నాడు జాన్సన్.

రాజు చెవులు రిక్కించి విన్నాడు. ఆ ఇంటి వాతావరణంలో ఏదో వెలితి తోచింది అతడికి.

"ఇందాకటివరకూ ఈ ట్రాన్సిస్టరు పని చేస్తూనే వుంది. మనం బయటకు వెళ్ళి వచ్చేలోపల, ఎవరో దాన్ని ఆపేశారు" అన్నాడు రాజు ఇల్లంతా కలయ జూస్తూ.

"అంటే ఎవరో ఇంట్లోనే దాక్కొని వున్నారన్న మాట! ఇల్లంతా వెదకండి!" అని అరిచాడు జాన్సన్.

అంతలోనే ఒక మూల కుప్పగా వున్న సామాన్ల క్రింద నుంచి ఒక భీకరకాయుడు, పెడబొబ్బ పెడుతూ, బయటకు దూకాడు.

అతడు ఎవరో కాదు పద్మనాభం. అతడి చేతిలో ఎనిమిదంగుళాల కత్తి తెల్లగా తళతళ మెరుస్తోంది.

"నేను ఎలాగో కెప్టెన్‌ని ఏమార్చి, రాత్రిపూట సముద్రంలోకి దూకి ఈ ద్వీపాన్ని చేరుకున్నాను. కానీ రామేశ్వరం పోయినా, శనేశ్వరం వదలనట్లుగా, మీరు మృత్యువును ఆహ్వానిస్తే వచ్చే అతిధుల్లాగా, నన్ను వెదుక్కుంటూ వచ్చారు!" అని అరిచాడు పద్మనాభం.

మాట పూర్తి అయీ కాకుండానే, పద్మనాభం తనకు చేరువలో వున్న నారాయణన్‌ని పొడవబోయాడు కత్తితో.

నారాయణన్‌ని ప్రక్కకు త్రోసేసి, తను ముందుకు వచ్చాడు జాన్సన్.

తన మీదకు వస్తున్న పద్మనాభంని చేయి పట్టుకుని మెలిత్రిప్పాడు. మెరుపులా అతడ్ని ఒక రౌండ్ కొట్టించి, లాగి తన రెండు చేతులమీదా అతడ్ని పైకెత్తేశాడు జాన్సన్.

వాలీబాల్‌ను విసిరేసినట్టుగా పద్మనాభంని బలంగా నేల మీదకు విసిరేశాడు జాన్సన్.

క్రిందపడ్డ పద్మనాభం మీదకు దూకాడు జాన్సన్. పద్మనాభం గభాల్న ప్రక్కకు దొర్లాడు.

జాన్సన్ నేలమీద బోర్లా పడ్డాడు. పద్మనాభం నేల మీద నుంచి లేస్తుండగా, జాన్సన్ అతడి భుజాలపై రెండు కాళ్ళూ వేసి, తను నేలమీదే ప్రక్కకు దొర్లాడు. పద్మనాభం అతడి కాళ్ళ మధ్యలో ఇరికి, ఒక పల్టీ కొట్టి పడిపోయాడు.

జాన్సన్ అతడి గుండెల మీద కూర్చుని పద్మనాభంని కసిదీరా పిడికిళ్ళతో గుద్దసాగాడు.

"జాన్సన్! అతడ్ని చంపకు! అతడితో మనకు చాలా పని వుంది!" అని అరిచాడు రాజు.

ఏమిటన్నట్టుగా చూశాడు జాన్సన్.

"నీవు విదేశీ గూఢచారివని నావికాదళంలో ఇతడు వదంతి లేపాడు కదా! నాక గురించి శత్రువులకు రహస్య సమాచారం ఇచ్చి, విమానాల్ని రప్పించింది ఇతడు. అతడి గదిలో దాచుకున్న ట్రాన్సిస్టర్‌ని నీ గదిలో దొరికిందని కెప్టెన్‌కి రిపోర్టు యిచ్చింది పద్మనాభం! అతడి నేరాన్ని అంగీకరింపజేస్తూ, నీవు నిర్దోషివని అతడి నుంచి వ్రాత మూలకమైన వాఙ్మూలం తీసుకుందాం!"

జాన్సన్ కళ్ళు ఆనందంతో మెరిసినయ్. "అదీ నిజమే! కోపంలో నా కంత వూహా తట్టలేదు!" అన్నాడు.

పద్మనాభం నోటంట రక్తం వస్తోంది. అతడు ఆయాసంతో రొప్పుతున్నాడు.

నారాయణన్ కుర్చీ తెచ్చి వేశాడు.

పద్మనాభంని కుర్చీలో కూలేసి, త్రాటితో అతడ్ని కుర్చీకి గట్టిగా బంధించారు.

ఏదో గుర్తుకు వచ్చినవాడిలా రాజు వెనక్కి తిరిగాడు. టేబుల్ మీదున్న ట్రాన్సిస్టర్‌ను ఆన్ చేశాడు.

రేడియోలో స్పెషల్ బులెటిన్ ప్రసారమవుతోంది'

"ఇప్పుడే అందిన శుభవార్త! ఢక్కాలోని పాకిస్థాన్ సైన్యాధికారి జనరల్ నియాజీ భారత సైన్యాలకు లొంగిపోయి, తమ ఆయుధాల్ని అప్పగించటం జరిగింది."

రాజు, నారాయణన్ సంతోషంతో ఎగిరిపడ్డారు.

"అన్నట్టు పద్మనాభం దగ్గర ట్రాన్స్మిటర్ వుండాలి కదూ?" అన్నాడు నారాయణన్.

"అవును సుమా!" అంటూ రాజు ఇల్లంతా కలయ వెదికాడు.

ఒక మూలగా నాపరాయి క్రింద నేల మాళిగ వుంది. అందులో ట్రాన్స్మిటర్ దొరికింది.

దాన్ని ఆన్ చేశాడు రాజు. "హలో! నావల్ హెడ్ క్వార్టర్స్! నావల్ హెడ్ క్వార్టర్స్!" అంటూ మెస్సేజి చెప్పసాగాడు రాజు.

-: ఐపోయింది :-

# సాగర చక్రవర్తి

## సుజనశ్రీ

'భారత దేశ పురోభివృద్ధిని ఆటంకపరిచేందుకు మనం ఎప్పటికప్పుడు గెరిల్లా దాడులు చేస్తూ, యుద్ధాల్ని తలపెడుతూనే వస్తున్నాం! కానీ ఒక ప్రక్క తన రక్షణ పాటవాన్ని పెంపొందించుకుంటూనే, ఎంతో అభివృద్ధిని సాధించడం మనకు వెన్నుపోటులా గుచ్చుకుని బాధిస్తోంది."

"పోకారన్"లో అణ్వస్త్రాన్ని విజయవంతంగా ప్రయోగించి ప్రపంచ అణు సంస్థలో చోటు సంపాదించింది భారతదేశం. రష్యా సహాయంతో "ఆర్యభట్ట" ఉపగ్రహాన్ని అంతరిక్షంలోకి పంపి, రోదసీ సంస్థలో స్థానాన్ని ఏర్పరచుకుంది."

మహమ్మద్ పీర్జాదా ఒక్క క్షణం ఆగి, తన ప్రసంగాన్ని శ్రద్ధగా వింటున్న అధికారుల వంక చూశాడు.

వారిలో చాలా భాగం మిలిటరీ అధికారులే. మరి కొందరు పరిస్థాన్ గూఢచారి విభాగం తాలూకు వాళ్ళు.

"పులిమీద పుట్రలా భారతదేశం మరో కొత్తమార్గంలో ప్రగతిని సాగించింది. అదే సాగర గర్భంలోని నూనె గనుల్ని కనిబెట్టి, ఆ చమురుని విజయవంతంగా వెలికి తీయటం. మన సోదరులు, అభిమానులూ, ఆత్మీయులూ అయిన అరబ్ దేశాలు పెట్రోలియం ఉత్పత్తిదారులు ధరలు పెంచి అమెరికా, ఇంగ్లండ్ లాంటి పెద్ద దేశాల్ని గడగడలాడించినయి. ఈ నూనె ధరల సంక్షోభాన్ని తట్టుకునేందుకు అగ్రరాజ్యాలు సయితం అరబ్ దేశాల షరతులను అంగీకరించక తప్పలేదు.

"అటువంటిది భారతదేశం నూనె అన్వేషణలో మరో అడుగు ముందంజ వేయబోతుంది, అంటే అరబ్ దేశాలపై ఆధారపడకుండా స్వయంసమృద్ధిని సాధించబోతోంది.

"జపాన్ వారి సాంకేతిక సహాయంతో అరేబియా సముద్రంలో, సాగర గర్భంలోని నూనె గనుల్నుంచి నూనె త్రవ్వకానికై 'సాగర్ సామ్రాట్' అనే ఆయిల్ రిగ్ ని నెలకొల్పింది. అలాగే బంగాళాఖాతంలో గూడ మరో చిన్న సైజు రిగ్ 'సాగర చక్రవర్తి' ని నెలకొల్పింది. అక్కడ గూడ నూనె లభ్యమయ్యే పరిస్థితిలో, భారత దేశం బయటనుంచి నూనెను దిగుమతి చేసుకునే అవసరమే ఉండదు ఉత్తరోత్తరా!

"కనుక మనం ఈ ప్రయత్నాన్ని వమ్ముచేయాలి. ఎల్ల కాలం భారతదేశం, మన మిత్రరాజ్యాలైన అరబ్ లపై

పెట్రోలియం కొరకు ఆధారపడేలా చేయాలి. ఈ పనిని చేయటానికి మన నావీ లెఫ్టినెంట్ జనరల్ ఒక బృహత్తర పథకాన్ని తయారుచేశారు. అదేమిటో ఆయనే స్వయంగా వివరిస్తారు మీకు!''

అంటూ పరిస్తాన్ ప్రెసిడెంట్ పీర్జాదా లెఫ్టినెంట్ జనరల్ మీర్జాఫర్ వంక చూశాడు చిరునవ్వుతో.

జనరల్ మీర్జాఫర్ కుర్చీలోంచి లేవగానే కరతాళ ధ్వనులు రేగినయి హాల్లో.

వినయంగా తల వంచి వందనం చేశాడు మీర్జాఫర్.

''ఈమధ్య నేను ఇంగ్లాండ్ కి వెళ్ళాను సుహృద్భావ యాత్రపై. అక్కడ కొందరు పైలెట్లను కలుసుకోవడం జరిగింది. వారి సంభాషణల్లో యధాలాపంగా ఒక ప్రసక్తి వచ్చింది. మొదటి ప్రపంచయుద్ధ కాలంలో జర్మనీలోని 'సీపర్' డామ్ని బద్దలుకొట్టేందుకు రాయల్ ఎయిర్ ఫోర్స్ తాలూకు విమానాలు దాడి జరిపినయి. అయినా అవి తమ పథకాన్ని నెరవేర్చలేక వెనక్కు తిరిగివచ్చినయి. ఎన్ని మార్లు ప్రయత్నించినా ఫలించలేదు వాళ్ళ యత్నాలు.

''అప్పుడు వారొక బ్రహ్మాండమైన పథకం వేశారు. కొన్ని వేల టన్నుల ప్రేలుడు పదార్థం గల బాంబుల్ని సీపర్ డామ్కి ఎగువన అంటే, డామ్ ఇంకా అయిదారు మైళ్ళ దూరం ఉన్నదనంగా, అక్కడ నీటిలో జారవిడిచారు. ఆ బాంబుల ప్రేలుళ్ళకు నదిలో బ్రహ్మాండమైన ఒత్తిడితో తరంగాలు లేచాయి. ఆ తరంగాలు మహోధృతంగా ముందుకు పోయినయి అదే పీడనంలో. ఆ పీడనానికిక ఫోర్స్కి తట్టుకోలేక డామ్ సగంలో బద్దలైపోయింది. క్రమంగా నీటి ఒరవడికి డామ్ పూర్తిగా కోసుకుపోయింది.

ఆ నది ఆయకట్టు క్రింద ఉన్న అనేక గ్రామాలూ ఆ జల ప్రళయంలో నాశనమైపోయాయి.

"ప్రస్తుతం మనం గూడ అదే పంథాలో బంగాళా ఖాతంలోని ఆయిల్ రిగ్ 'సాగర చక్రవర్తి'ని ఛేదించబోతున్నాం.

ముందుగా కొన్ని మందు పాతర్లను "మైన్స్"ని సముద్రంలోకి వదులుతాం. అవి ఫుట్ బాల్ సైజులో ఉండి అన్ని వైపులా లేడికొమ్ముల్లాంటి కొమ్ముల్ని కలిగి ఉంటాయి. అవి నీటిలో పూర్తిగా మునగవు. అంటే అడుగు భాగం, నేలకంటూ చేరవు. ఇటు నీళ్ళపైనా తేలవు. సముద్ర గర్భంలో, ఆకలిగొన్న రాక్షసులు ఆహారం కోసం నోరు తెరుచుకుని పయనించేలాగ, తిరుగాడుతుంటాయి.

ప్రమాదవశాత్తు ఏదైనా సబ్ మెరీన్ గానీ, లేదా ఏదైనా షిప్ అడుగు భాగం కానీ, మందు పాతర కొమ్ముకి తగిలిందో, మందు పాతర ప్రేలిపోయి ఆ షిప్ గానీ, సబ్ మెరీన్ గానీ ముక్కలు ముక్కలుగా ప్రేలటం ఖాయం.

"ఆ మందు పాతర్లను బంగ్లాదేశ్ తీరంలో వదలుతాం. ఆ తర్వాత వాటి వెనుకగా కొంచెం దూరంలో అలల్ని కలిగించే బాంబుల్ని ప్రేలుస్తాం. ఆ బాంబుల ఉధృతానికి ఏర్పడిన అలలు ఈ మందు పాతర్లను ఇంకా ఇంకా ఇంకా ముందుకు తోసుకుపోతాయి. అ విధంగా మనం వదిలిన అనేక మందు పాతర్లలో కొన్నైనా 'సాగర చక్రవర్తి'ని చేరుకొని ఆ ఆయిల్ రిగ్ ని నాశనంచేయక మానవు." అంటూ మీర్జాఫర్ తన లెక్చర్ ని ముగించాడు.

హాల్లో మరోసారి చప్పట్లు మారుమ్రోగినయి,

# 2

ఆయిల్ అండ్ నాచురల్ గ్యాస్ కమీషన్ తాలూకు దక్షిణ మండలం డైరక్టర్ మిశ్రా తన గదిలో హడావిడిగా తిరుగుతున్నాడు.

ఆ గదిలోనే మరో మూల వైర్ లెస్ సెట్ ముందు కూర్చుని ఆపరేటర్ అరుస్తున్నాడు మౌత్ పీస్ లో.

"గట్టిగా మరో సారి చెప్పు. ఈ తడవ పార్లమెంటు సమావేశానికల్లా, మన ఎక్స్ప్లొరేషన్ ఫలితాలు అంద జేయమని ప్రెసిడెంటు ఆదేశం. కనుక అరుణాచలానికి నా మాటగా తెలియజేయి! ఇరవయి నాలుగు గంటలూ శ్రమించి అయినా సరే, సత్ఫలితాన్ని అందజేయమని చెప్పు!" మిశ్రా వైర్ లెస్ ఆపరేటర్ తో చెప్పాడు.

"అలాగే సార్!" అంటూ ఆపరేటర్ మెస్సేజ్ చెప్ప డంలో నిమగ్నుడై పోయాడు.

అరుణాచలం భూగర్భ పరిశోధనలో కేవలం పట్ట భద్రుడు. అయినా ఆ ఫీల్డులో అతనికన్న ఉన్నత విద్యని అభ్యసించిన వాళ్ళకన్న నిపుణతగా, ఎక్కడ ఆయిల్ పడేదీ, ఎక్కడ పడనిదీ ఠంచన్ గా చెప్పగలిగేవాడు.

ఎందరో నిపుణులు ఆయిల్ లభ్యమవుతుందన్న చోట, అరుణాచలం అక్కడ లభ్యం కాదని నిక్కచ్చిగా చెప్పాడు. అయినా మిశ్రా నిపుణులు నివేదికపై ఆధార పడి అన్వేషణ చేయించాడు రిగ్ లతో. లక్షలు ఖర్చాయి నయి. అటు నూనెగానీ ఇటు వాయువుగానీ లభించలేదు. పైగా ఆడిట్ రిపోర్టులో లక్షలకు లక్షలు దుబారా అని తనపై ఆరోపణ!

ఇలాంటివే నాలుగైదు సంఘటనలు జరిగాక మిశ్రాకు అరుణాచలంపై గురి కుదిరింది. అరుణాచలం ఎంపిక చేసిన

ప్రదేశాల్లో చాల తక్కువ వ్యయంలోనే, నూనె గనుల ఉనికి దొరికేది.

అందుకే ఎందరో అధికారులు అభ్యంతరం తెలిపినా, వారితో పోరాడి తమ సంస్థలో 'ఏ' గ్రేడ్ సైంటిస్ట్‌గా నియమించాడు అరుణాచలాన్ని, మిశ్రా. నిజానికి 'ఏ' గ్రేడ్ సైంటిస్ట్ కావాలంటే ఇంకా ఉన్నత విద్యా ప్రమాణాలుండాల్సిందే!

ప్రస్తుతం నూనెకోసం అన్వేషణ బంగాళాఖాతంలో జరుగుతోంది. విదేశీ నిపుణులు కొందరు అక్కడ నూనె దొరకటమేమిటి అని హేళన గూడ చేశారు. కాని అరుణాచలం ముందు కొంత కాలం ఆ ప్రాంతంలోని సముద్రపు అడుగున సర్వే జరిపాక, అక్కడ తప్పకుండా నూనె లభ్యమవుతుందని నిర్ణయించాడు.

జపాన్ వారి సహకారంతో మరో రిగ్ 'సాగర చక్రవర్తి' నిర్మాణం పూర్తయింది. అరేబియా సముద్రంలోని "సాగర్ సామ్రాట్" కన్న ఈ రిగ్ "సాగర చక్రవర్తి" చాల చిన్నది.

సాగర చక్రవర్తికి మూడే కాళ్ళు. సముద్రం అట్టడుగున నేలమీదకు కాళ్ళు అని ఉండయి. సముద్ర మట్టానికి పైన షిప్ లాగ రిగ్ ఉంటుంది. అందులో డ్రిల్లింగ్ పరికరాలూ, క్రిందనుంచి వెలికితీయబడిన మట్టిని పరీక్షించేందుకు ప్రయోగశాల, ఇంజనీర్లు, సైంటిస్టులు, ఇతర సాంకేతిక సిబ్బంది నివసించేందుకు గదులూ అన్నీ ఈ షిప్‌లో ఉంటయి.

'సాగర చక్రవర్తి'లో పంపుసెట్లు శబ్దం చేస్తున్నయ్. జనరేటర్లు రొద పెడుతున్నయ్. ఇనుప రెంచీలు ఇనుప

కమ్మీలను కొట్టుకుని విచిత్రమైన శబ్దాల్ని చేస్తున్నయ్. అటూ ఇటూ తిరుగుతున్న ఇంజనీర్ల బూట్ల చప్పుడు వినవస్తోంది. అంత హడావిడిలో వినబడనిది ఒక్క మనుష్యుల కంఠాలే.

అక్కడున్న వ్యక్తులందరూ మాట్లాడకుండా పని చేసుకుపోతున్నారు, యంత్రాలకన్నా వేగంగా. అతి జాగరూకతతో తమ విధుల్ని నిర్వర్తిస్తున్నారు. ఏమాత్రం ఏమారినా, ఏ చిన్నపొరపాటు జరిగినా వారి పథకం తారుమారవుతుంది. ఎంతో కాలం వృథా అవుతుంది. కొన్ని లక్షల రూపాయలు సముద్రంలో పోసినట్టే! అందుకే వారందరికీ ప్రతి క్షణం ఎంతో విలువైనది. అతి జాగరూకతగా, కంప్యూటర్లకంటె సునిశితంగా ఆలోచిస్తూ, పనులు చేసుకుపోతున్నారు. ప్రతి క్షణం కొన్ని వేల రూపాయలు విలువైనది.

"కాలం ఎంతో విలువైనది, అధిక ప్రసంగం చేయకు, అనుమానాలు రేపకు! అనవసర ప్రశ్నలు వేయకు" ఇవే 'సాగర చక్రవర్తి నిబంధనలు!

# 3

'సాగర చక్రవర్తి' చుట్టూ నిదానంగా పయనిస్తున్నది పాట్రోల్ షిప్ 'ఎస్. ఎస్. రాజేంద్ర'! ఆ నౌక కెప్టెన్ నారాయణకు సాగర చక్రవర్తి గురించి అతడి స్వంత అభిప్రాయాలు అతడికున్నయ్. అక్కడున్న వారిలో ఎక్కువ మందిలాగే, ఆ ప్రాంతంలో నూనె దొరకదనే అభిప్రాయంతోనే వున్నాడు నారాయణ.

అయినా అతడి కిష్టం వున్నా లేకపోయినా, సాగర చక్రవర్తికి కాపలాగా ఇరవై నాలుగు గంటలూ గస్తీ తిరుగుతుండటమే అతడి నౌక విధి!

అంతేకాక, తీరంనుంచి ఆహారపదార్థాలు రిగ్ మీదకు చేరవేయటం, జనాన్ని రిగ్ మీదనుంచి తీరానికి చేర్చటం తిరిగి తీసుకురావడం, రిగ్ మూడు పాదాలు సరిగా వున్నయ్యో లేదో చెక్ చేయటానికి నీళ్ళలోకి డైవ్ చేసే ఫ్రాగ్ మెన్‌ని దింపడం, తిరిగి వాళ్ళని పైకి చేర్చడం ఇవి గూడ 'S. S. రాజేంద్ర నౌక చేయవలసిన విధులు.

ఒకసారి నారాయణ బంగ్లాదేశ్‌కి వెళ్ళాడు. హార్బరులో నౌకను లంగరు వేసి వుంచి సిటీలోకి వెళ్ళాడు. ఒక క్లబ్‌లో చాలా మంది ఆడవాళ్ళు అతడ్ని చుట్టుముట్టారు. సాగర చక్రవర్తి ఆయిల్‌ని కనిపెట్టిందా అని ఆత్రంగా అడిగారు. డబ్బుకు ఒళ్ళమ్ముకునే ఆడవాళ్ళకు ఈ సంగతులతో ఏం పనా అని విస్తుపోయాడు నారాయణ. వాళ్ళల్లో గూడ విదేశీ ఆయిల్ కంపెనీల కిరాయి గూఢచారులున్నారేమో అనుకున్నాడు.

బంగాళాఖాతంలో తిరిగే విదేశీ నౌకల్లోంచి చాలా మంది బైనాక్యులర్స్ పెట్టుకుని సాగర చక్రవర్తి, సముద్ర నీటి మట్టానికి పైన కృత్రిమంగా నిర్మింపబడిన రిగ్ ఇనుప ద్వీపం వంక ఆశ్చర్యంగా చూడటం నారాయణ చూడక పోలేదు.

లోగడ ఒకరిద్దరు గూఢచారులు ఫ్రాగ్ మెన్‌గా నీళ్ళల్లో మునిగి సాగర చక్రవర్తి దగ్గరకు వచ్చినట్టుగూడ విన్నాడు నారాయణ. కానీ అతడు పాట్రోల్ ఛార్జ్ తీసుకున్నాక అటువంటి సంఘటనలేం జరగలేదు.

రిగ్ మూడో కాలి వద్దకు నీళ్ళలో ఏదో నీడలాటిది . పయనిస్తోంది.

మెడకు తగిలించుకున్న బైనాక్యులర్స్‌ని కళ్ళ ముందుకు పెట్టుకుని నీళ్ళలోకి చూశాడు. ఆ బైనాక్యు

లర్స్‌లోంచి చూస్తే నీటి లోపలి భాగంగూడ కనపడేలా స్పెషల్ లెన్స్ అమర్చబడింది ఆ బైనాక్యులర్స్‌కి.

ఫుట్‌బాల్ పరిమాణంలో ఏదో వస్తువు రిగ్ కాలి వేపుగా ప్రయాణిస్తోంది అలల తాకిడికి.

'ఇది అసంభవం! ఇలా జరగటానికి వీల్లేదు!' అని తనలో తనే గొణుక్కున్నాడు పిచ్చిగా.

దాని ఆకారం చూస్తూంటే, అదేదో మందుగనిలా తోచింది. కానీ సీ-మైన్‌ని ఇక్కడెవరు వదిలి ఉంటారు? ఏదైనా కాబటేజ్ జరిగి వుంటుందా? తను వెయ్యి కళ్ళతో కాపలా కాస్తుండగా దేశద్రోహు లెవరు ప్రవేశించి వుంటారు ఈ ప్రాంతంలోకి?

# 4

అది మందుగని అయి వుండదు! ఈ రిగ్ మీద పని చేసే ఇంజనీరు వెధవలు ఎప్పుడు నేర్చుకుంటారు, రిగ్ క్రిందగా సముద్రంలోకి ఏ వస్తువునూ జారవిడువరాదని కఠిన నిబంధన వున్నా, వాళ్ళు నిర్లక్ష్యంగా చిన్న చిన్న డ్రమ్ముల్నీ, గ్యాస్ డబ్బాల్నీ నీళ్ళలోకి విసిరేస్తుంటారు.

తను చూస్తున్న వస్తువు గూడ అలాటి ఖాళీ డ్రమ్ అయి వుంటుందా? దాన్ని ముందు వల వేసి పట్టాలి. తర్వాత దాన్ని రిగ్ మీదకు తీసుకు వెళ్ళి ఎవరు ఆ డ్రమ్‌ని క్రిందకు జారవిడిచారో విచారణ జరిపి, వాళ్ళ మీద కఠిన చర్య తీసుకోవాలి!

డెక్ మీది నావికుల్ని కేక వేశాడు కెప్టెన్ నారాయణ.

వలలు తీసుకుని నావికులు పరుగెత్తుకు వచ్చారు. నీళ్ళలోకి వలల్ని విసిరారు. వాళ్ళ యత్నం ఫలించలేదు.

వెలుగు ఆ వస్తువుని పట్టలేదు. చాలా ఇవతలగా పడినై.
వలల్ని వెనక్కి లాగారు. తిరిగి నీళ్ళలోకి విసురుతున్నారు.

సెర్చ్‌లైట్‌ని నీళ్ళలోకి ఫోకస్ చేశారు.

రిగ్ మీద ఇంజన్ల మోత, పంపుసెట్ల రొద, డ్రిల్లింగ్ మిషన్ల శబ్దం ఉధృతంగా వినవస్తోంది. సెర్చిలైట్ వెలుగులో రిగ్ మూడో కాలి చుట్టూ శబ్దం చేస్తూ, సుళ్ళు తిరుగుతున్నాయ్ నీళ్ళు.

మూడు కాళ్ళ మధ్యగా గుండ్రంగా తిరుగుతూ లోపలకు తొలుచుకుంటూ గొట్టాలు దిగిపోతున్నాయ్ అగాథం లోకి.

కెప్టెన్ నారాయణ బైనాక్యులర్స్‌తో వెలుగు పడుతున్న మేర నీళ్ళలోకి చూశాడు. ఇప్పుడా వస్తువు స్పష్టంగా కనుపిస్తోంది.

వియత్నాం యుద్ధంలో అమెరికా వారు సముద్రంలో మైన్స్‌ని వుంచటం అందరకూ తెలిసినదే! వాటిని ఎలా నీళ్ళలో వదులుతారో తను సినిమాల్లో గూడ చూసి వున్నాడు. ఒక్క క్షణం అతడు స్థాణువులా వుండి పోయాడు.

నీటిలో మందు గనిని తొలగించాలంటే, దానికి ప్రత్యేకమైన పరికరాలు కావాలి. పైగా ఆ పని చాలా ప్రమాదంతో కూడుకున్నది. మందుగని ప్రేలేలా చేస్తే, సగం బెడద తీరిపోతుంది. కాని అది రిగ్ క్రింద జరగ కూడదు.

మందు గనిని అలల తాకిడివల్ల దూరంగా పోయేట్టు చేయాలి. నిరపాయకరమైన చోట దాన్ని ప్రేల్చేయవచ్చును.

డెక్ మీదున్న మిగతా వాళ్ళందరూ తాము వేటాడు తున్నది ఖాళీ డ్రమ్ము కాదనీ, మందుగని అనీ ఈ పాటికి గుర్తించినట్టున్నారు. వాళ్ళకళ్ళల్లో భయం ద్యోతక మవుతోంది.

వైర్‌లెస్‌లో ట్రాలర్‌కు కబురు వెళ్ళింది. మరోసారి స్పెషల్ గన్‌తో మందుగని వైపు షాట్ వెళ్ళింది. నీళ్ళలో తరంగాలు లేచినయ్. రిగ్ కాలి దగ్గరకు చేర బోతున్న మందుగని వెనక్కు జరిగింది అలల తాకిడికి.

అవతల రెండు కాళ్ళ మధ్యగా మందుగని దూరంగా వెళ్ళిపోతే గండం గడిచినట్టే అనుకున్నాడు కెప్టెన్. అయితే అతడి ఆలోచనల్ని వమ్ము చేస్తూ, అలల తాకి డిలో ఒక వూపు ముందుకు వూగిన మందుగని అతివేగంగా వెనక్కు వచ్చి రిగ్ కాలికి ఢీకొంది.

# 5

అనేక భూతాలు ఒక్కుమ్మడిగా అరుస్తున్నట్టుగా సైరన్ మ్రోగుతోంది పెద్దగా, ఆయిల్ రిగ్ 'సాగర చక్రవర్తి' మీద.

రిగ్ మీద అనేక గదుల్లో లౌడ్‌స్పీకర్లలో కూడ హెచ్చరిక వినబడింది, "అందరూ రిగ్ మీద నుంచి దిగేయండి! పారిపొండి" అంటూ.

డ్రిల్లింగ్ ఇంజన్ల మోత ఆగిపోయింది. కరెంటుపోతే ఆగిపోయిన సినిమాలాగ మిషన్లన్నీ స్థంభించిపోయాయి. కొందరు ఎక్కడ పనిని అక్కడే వదిలేసినిచ్చెన మీదుగా వేగంగా దిగి 'ఎస్. ఎస్. రాజేంద్ర' నౌకలోకి దూకుతు న్నారు.

రిగ్ మీదున్న వాళ్ళంతా నమ్మలేనట్టుగా సైరన్ మోతని ఆలకిస్తున్నారు. పని ఆపివేస్తున్నారు. మరోసారి

ఆలకించి, సైరన్ నిజంగానే మ్రోగుతున్నదని రూఢి చేసుకుని భయాశ్చర్యాలతో పరుగు లంకించుకుంటున్నారు.

అంతలో మందుగని బ్రహ్మాండమైన శబ్దంతో పేలి పోయింది. 'సాగర చక్రవర్తి' రిగ్ మూడు కాళ్ళల్లో ఒక కాలు మధ్యకు విరిగిపోయింది.

కెప్టెన్ నారాయణ మిగతా రెండు కాళ్ళ వైపు చూశాడు. అవి బాగానే వున్నాయి. మూడో కాలు విరగంగానే, బ్యాలెన్స్ తప్పిపోయి రిగ్ ఒక ప్రక్కకు ఒరిగిపోకుండా ఉంటే బాగుండును అనుకున్నాడు కెప్టెన్. అయితే అతడి ఆశ అడియాసే అయింది. రిగ్ ఒక ప్రక్కకు ఒరిగిపోయింది. బరువంతా ఒకే వైపుకు మొగ్గటంతో మిగతా రెండు కాళ్ళూ పెట పెట మని పెద్ద శబ్దం చేస్తూ విరిగిపోయాయి.

కొన్ని కోట్ల రూపాయల వ్యయంతో నిర్మించిన భారత దేశపు ఆశాసౌధంలాంటి ఆయిల్ రిగ్ 'సాగర చక్రవర్తి' కూలిపోతోంది. తామందరూ చూస్తూండగానే, తమ కళ్ళెదుటే సాగరగర్భంలో కలవబోతోంది.

రిగ్ పూర్తిగా ఒరిగిపోయి ఎంతో ఎత్తు మీదనుంచి నీళ్ళ ఉపరితలం మీదకు జారుతోంది.

రిగ్ మీద సైరన్లు యింకా మ్రోగుతూనే వున్నాయ్.

రిగ్ మధ్యలో సాగర గర్భంలోకి డ్రిల్ చేస్తున్న ఇంజనీర్లు పని ఆపుచేసి రిగ్ రెయిల్స్ మీదకు ఎక్కి చూశారు. రిగ్ లోపల గదుల్లో ఫలహారం చేస్తున్నవాళ్ళు ప్లేట్లు చేత్తో పుచ్చుకుని రిగ్ యొక్క డెక్ మీదకు పరుగెత్తారు. తమ గదుల్లో విశ్రాంతి తీసుకుంటున్న వాళ్లు

కంగారుగా లేచి చేతి కందిన గుడ్డలూ, బూట్లూ, లైఫ్ బెల్టులూ తీసుకుని ద్వారం వేపుకు పరుగెత్తుతున్నారు. అలా పరిగెత్తేవారిలో కొందరు "ఏం జరిగింది?" అని ఆత్రంగా కనబడ్డవారినల్లా అడుగుతున్నారు. కాని వారి ప్రశ్నలకు సమాధానం చెప్పేవారే లేరు.

కెప్టెన్ నారాయణ లౌడ్ స్పీకర్లలో పెద్దగా చెబుతున్నాడు "రిగ్ కూలిపోతోంది. లైఫ్ బెల్టులు ధరించి నీళ్ళలోకి దూకేయండి. నీళ్ళలో పడ్డవాళ్ళను మేం రక్షిస్తాం."

గాలి నిండిన మోటార్ టైర్లలాంటి చక్రాలను నడుముకు తగిలించుకుని జనం రిగ్ మీదనుంచి నీళ్ళలోకి దూకేస్తున్నారు. అలా దూకిన వాళ్ళను నౌకలోని నావికులు తాళ్ళు విసిరి, వాళ్ళను నౌకలోకి చేరుస్తున్నారు.

# 6

లేబరేటరీ గదిలో అరుణాచలం కొత్తగా వచ్చిన సాగర గర్భంలోని మట్టి శాంపిల్స్‌ని కెమికల్ ప్రాసెస్‌లో పరీక్ష చేస్తున్నాడు.

అతడి చెవుల్లో సైరన్‌ల మోతగానీ, మందుగని ప్రేలుడుగానీ ఎక్కలేదు! అతడు పూర్తిగా తన పనిలో నిమగ్నుడై వున్నాడు!

అంతలో ఎయిర్ కండిషన్డు చేయబడిన లేబరటరీ గదిలో స్పీకర్ల నుంచి హెచ్చరిక వచ్చింది "రిగ్ కూలిపోతోంది. అందరూ పారిపోండి."

ఒక్క క్షణం సైంటిస్టు అరుణాచలం ప్రాన్పడిపోయాడు. హెచ్చరిక వస్తున్న స్పీకర్ వైపు వెర్రిగా చూశాడు. అంతలోనే పెద్దగా ప్రేలిన ధ్వనికి రిగ్‌లో ప్రతి బోల్టూ, నట్టూ గూడ కంపించినయ్.

రిగ్ ఒరిగిపోయి నీళ్ళ మీదకు జారిపోతోంది. రిగ్ మీద పేర్చబడ్డ మెషినరీ పెద్ద శబ్దం చేసుకుంటూ క్రిందకు జారి ఇనుప నేలకు ఢీకొంటున్నాయ్. ఆ ఇనుప వస్తువుల క్రిందపడి ఒక రిద్దరు చచ్చిపోయారు. మరికొందరికి కాళ్ళూ చేతులూ విరిగిపోయాయి.

అతి బరువైన పైపులూ, పెద్ద పెద్ద రెంచీ సెట్లూ, ఆయిల్ డ్రమ్ములూ, డ్రిల్లింగ్ ఇంజన్లూ, పొడవాటి ఇనుప చెన్ల కట్టలూ ప్రాణాలను అరచేతిలో పట్టుకుని పారిపో తున్న మనుష్యుల మీదకు పిడుగుల వర్షంలా పడు తున్నయ్.

రిగ్ అడుగు భాగం లోంచి సాగర గర్భంలోకి దింప బడిన పటిష్టమైన పైపులు సహితం, జారిపోతున్న రిగ్ బరువుకు వుండీ బద్దలాగ వంగిపోయినయ్.

సైంటిస్ట్ అరుణాచలం లేబరటరీ శాలనుండి డెక్ మీదకు రావాలంటే, మధ్యలో ఆరు ద్వారాలు తెరుచు కుని రావాలి.

ప్రయోగశాల ఎయిర్ టైట్ గా ఉండటానికీ, ఎటు వంటి శబ్దాలూ రాకుండా వుండాలని ప్రత్యేకంగా నిర్మిం చారు ఆ ద్వారాల్ని. ఒక తలుపు తెరచి తర్వాత దాన్ని తనవెనుకే తాళం వేయాలి. అప్పుడుగాని ముందు తలుపు తెరచుకోదు. అంతా ఆటోమేటిక్ సిస్టమ్.

అరుణాచలం అంతా ముంచుకొచ్చాక గానీ పారిపోవ టానికి యత్నించలేదు. ఒక తలుపు తెరచుకునివచ్చి, దాన్ని మూసేసి, మరో తలుపు తాళంతీసే లోపలే రిగ్ ఒరిగిపోయింది.

ఆ గదిలోని టేబులూ, బెంచీలూ, ఎత్తుబల్లలూ, వాటి మీదున్న అతి ముఖ్యమయిన పరికరాలూ అన్నీ ఒరిగిపోతు

న్నయ్. నేలను ఢీకొని కొన్ని పగిలిపోతున్నయ్. గోడలకు కొట్టుకుని మరికొన్ని, మళ్ళీ గదిమధ్యకు వచ్చి పడుతున్నయ్.

తెరచిన తలుపులు మళ్ళీ ధడాలున మూసుకుంటున్నయ్, గది ప్రక్కకు ఒరగటంవలన. మరి కొద్ది సేపట్లో రిగ్ మరో పల్టీ కొట్టడంతో మూసుకున్న తలుపులు ధడాలున తెరుచుకుంటున్నయ్.

అరుణాచలం అటూ ఇటూ తూలిపడిపోతున్నాడు. ఎంత యత్నించినా అక్కడికక్కడే గానుగెద్దులా తచ్చాడటమే గానీ, ఒక్కడుగు ముందుకు వేయలేకపోతున్నాడు.

తన అసిస్టెంట్ చటర్జీకోసం కేకపెట్టాడు. కాని సమాధానం లేదు.

# 7

కెప్టెన్ నారాయణ షిప్ డెక్ మీద నిలబడి బైనాక్యులర్స్‌లోంచి చూస్తున్నాడు. రిగ్ మీదనుంచి పెద్దపెద్ద ఇనుపసామానులు సయితం క్రింద పడుతున్నయ్ నీళ్ళలోకి. మరో ప్రక్కనుంచి మనుష్యులు నీళ్ళల్లోకి దూకుతున్నారు.

డెక్ మీదున్న నావికులు వలల్నీ, త్రాళ్ళనూ, బోటు కొక్కీలను నీళ్ళలోకి విసురుతున్నారు. నీళ్ళలో పడ్డ వ్యక్తులు వాటిని అందుకుని, వాటిమీదుగా ఎగబ్రాకితే, నావికులు వాళ్ళను పైకి డెక్ మీదకు లాక్కుంటున్నారు.

ఎన్నోలక్షల రూపాయల ఖరీదుచేసే రిగ్ లోని పరికరాలకన్నా వాళ్ళకు మనుష్యుల ప్రాణాలే ముఖ్యం, డబ్బుతో రిగ్ నీ, రిగ్ పరికరాల్నీ తిరిగి కొనవచ్చు. కానీ మనుషుల ప్రాణాలు కొనలేము.

సాగర చక్రవర్తిని సముద్రం తనలో కలిపేసుకుం టోంది. అకస్మాత్తుగా జరగలేదు ఆ పని. స్లో మోషన్ పిక్చర్లోలాగ నిదానంగానే జరిగింది. అయినా ఆ సంఘ టనను నివారించటం ఎవరి తరమౌతుంది?

"నీళ్ళలో పడ్డవాళ్ళందర్నీ డెక్ మీదకు చేర్చారా? ఇంకా ఎవరన్నా నీళ్ళలో మిగిలిపోయారేమో జాగ్రత్తగా వెదకండి. అదుగో! అటుప్రక్క ఎవరో నీళ్ళమీద తేలారు. నీళ్ళలో బోర్లాపడి వున్నాడు. బహుశా చచ్చా డేమో! ఎవరైనా ఆ వ్యక్తిని ఆనవాలు పట్టగలరేమో యత్నించండి!" కెప్టెన్ నారాయణ విరామం లేకుండా ఆజ్ఞలు జారీ చేస్తున్నాడు.

రిగ్ చాలాభాగం నీళ్ళలో మునిగిపోయింది. రెండు కాళ్ళు మాత్రం, జరిగిపోయిన విషాదఘట్టాన్ని జ్ఞాప కార్థంగా నీటిమట్టానికి ఉన్నతంగా నిలబడి వున్నయ్. మూడో కాలు నీళ్ళలోకి సగానికి విరగటంవలన అది నీళ్ళ మీదకు కనబడటంలేదు.

ఆకలి భూతం తనకు చిక్కిన జీవిని కబళిస్తున్నట్టుగా, అనంతసాగరం అతి విలువైన రిగ్‌ని క్రమేపీ తనలోకి ఇముడ్చుకుంటోంది. రిగ్ గదుల్లోని ఫ్లోరెసెంట్ దీపాల వెలుగూ, డ్రిల్లింగ్ ప్లాట్ ఫారమ్మీద ఎర్రని లైట్లకాంతీ నీళ్ళలోంచి ఇంకా లీలగా కనుపిస్తోంది.

చనిపోయినవారి శవాలు నీళ్ళమీద తేలినయ్. వారిలో ఇంకా ఎవరైనా కొనవూపిరితో వున్నారేమో అని కొందరు నావికులు బోట్లలో వెళ్ళి వెదికారు.

మరో జట్టు చనిపోయినవారి శవాలను పెద్దబోటులో కప్పవేశారు, ఎవరెవరు ఆ ప్రమాదంలో ప్రాణాలు

కోల్పోయింది లెక్క వేయటానికి వీలుకోసరం!

సాగర చక్రవర్తి పూర్తిగా నీళ్ళలో మునిగిపోయింది. నీటిమట్టానికి పదిఅడుగుల లోతున, విరిగిపోయిన రిగ్ రెండుకాళ్ళకు అడ్డంపడి, అక్కడే ఆగిపోయింది.

నిజానికు ఒక షిప్‌ని మూడుకాళ్ళమీద నిలబెట్టినట్టే వుంటుంది రిగ్. అయితే ఇందులో ఆయిల్ సాంపిల్స్‌ని డ్రిల్ చేసే పరికరాలతో నిండి వుంటుంది.

నీళ్ళల్లోంచి మునిగిపోయిన రిగ్ గదుల్లోని లైట్ల వెలుగు లీలగా కనుపిస్తోంది. కెప్టెన్ నారాయణ వైర్‌లెస్‌లో అరిచాడు, "రిగ్‌లో ఇంకా ఎవరైనా వున్నారా?" అంటూ.

అతడి మెసేజ్ రిగ్‌లోని గదులన్నిటిలోకి వినిపిస్తుంది. అందులో ఎవరైనా ఇంకా ప్రాణాలతో మిగిలి వుంటే, వాళ్ళు మాట్లాడేందుకు అవకాశం వుంది.

అంతలోనే రిగ్‌లోని జనరేటర్ల నిండా నీరు ప్రవహించింది కాబోలు రిగ్‌లోని లైట్లన్నీ ఆరిపోయాయి.

# 8

అరుణాచలం కళ్ళు తెరిచాడు.

చుట్టూ భయంకరమైన నిశ్శబ్దం తాండవిస్తోంది. అతడు నేలమీద పడుకునివున్నాడు వెల్లకిలా.

గదిలోని సామానంతా చిందరవందరగా అతడిచుట్టూ పడివుంది. ఎందుచేతనో ఆ గదిలో లైట్లు ఇంకా వెలుగుతూనే వున్నయ్, బహుశా ప్రత్యేకమైన జనరేటర్ వుండటంవల్లనేమో.

గది నాలుగుమూలలా కలయజూశాడు. అతడి కళ్ళకు వస్తువులన్నీ మసకమసకగా కనుపిస్తున్నాయ్. కళ్ళజోడు

కోసం తడుముకున్నాడు. అది నేలమీది సామాన్లగుట్టలో ఎక్కడో పూడిపోయి ఉంటుంది. అతడి చేతిలో ఇంకా సముద్రగర్భంలోంచి తీసిన మట్టి శాంపిల్ అలానే వుంది.

అరుణాచలం లేచి కూర్చున్నాడు. అతడికి జరిగిపోయినదంతా పీడకలలా గుర్తుకు వచ్చింది మళ్ళీ. సైరన్ల హెచ్చరిక విని, ప్రమాదసూచన చెవుల్లో పడంగానే, అతడు తన గదిలోంచి బయటపడడానికి యత్నించాడు. ఒక గది దాటేసరికి రిగ్ కూలిపోయినట్టుంది, గది తల క్రిందు లవటంతో తను నిలదొక్కుకోలేక పడిపోయాడు.

తన అసిస్టెంట్ ఛటర్జీగూడ అక్కడే కలిశాడు తనతో. మరి ఛటర్జీ ఏమైపోయాడు. ఏదో బలమైన ఇనుప వస్తువు పైనుంచి తనమీద పడడంతో అరుణాచలానికి స్పృహ తప్పిపోయింది.

ఛటర్జీగూడ నేలమీద కుప్పతిప్పలుగా పడివున్న సామాన్ల గుట్టలో ఎక్కడో పూడుకుపోయాడా? అతి ప్రయత్నంమీద లేచి నిలబడ్డాడు, అరుణాచలం.

ఆ గదిలో లైట్లు అకస్మాత్తుగా ఆరిపోయాయి. అరుణాచలం హృదయం దడదడా కొట్టుకుంది. అతడికి చీకటి అన్నా, నీళ్ళు అన్నా తగని భయం. చిన్నతనంలో పల్లె వాతావరణంలో పెరిగినపుడు అతడు పల్లెలపట్ల అదో రకమైన ద్వేషాన్ని పెంచుకున్నాడు - పల్లెల్లో రాత్రయితే కిరసనాయిలు దీపాల వెలుగు తప్ప, మిగతా వాతావరణమంతా చీకటిగా వుంటుంది గనుక.

అందుకే తనగదిలో ఇరవయ్ నాలుగుగంటలూ వెలిగేలా ఫ్లోర్ సెంట్ లైట్లను అమర్చుకున్నాడు. ఇప్పుడీ చీకటిలో తనెలా గడపగలడు? బ్యాటరీ సెల్స్ పై పనిచేసే ఎమర్జన్సీ

లైట్ అల్మరాలో వుండాలి. అదీ అక్కడ వుందో, ఈ సామాన్లలో చెల్లాచెదరై పగిలిపోయిందో?

గోడలవెంట తడుముకుంటూ వెళ్ళాడు అరుణాచలం. అతడి చేతికి అల్మరా తగిలింది. దాని గొళ్ళేలు గట్టిగా బిగించబడి వుండటంతో, దాని తలుపులు తెరుచుకోలేదు ఈ కల్లోలంలో.

అతి ప్రయత్నంతో గొళ్లెం తీసి ఎమర్జన్సీ లైటు స్విచ్ నొక్కాడు అరుణాచలం. గది నిండా వెలుతురు వచ్చింది మళ్ళీ.

తనేదో రిగ్ మీద చిన్న ప్రమాదం జరిగివుంటుందని సరిపెట్టుకో జూశాడు. కానీ అనుకున్నదానికన్నా పెద్ద ప్రమాదమే జరిగివుండాలి. రిగ్ కాళ్ళలో యెక్కడో లోపభూయిష్టమైన ముడిఇనుము వాడబడి వుండాలి. అక్కడే కాలు విరిగిపోయి, రిగ్ పడిపోయింది కాబోలు.

ఒకసారి తలుపులు తెరుచుకుని బయటకు వెళ్ళి చూడాలనిపించింది అరుణాచలానికి. అల్మరాలోని టార్చిలైట్ నొకదాన్ని తీసుకుని తలుపుదగ్గరకు వెళ్ళాడు. డోర్ హ్యాండిల్ తడిగా వుంది. తలుపు తీయంగానే వరద నీరులా నీరు లోపలకు చొచ్చుకువచ్చింది.

బలంగా తలుపును నెట్టి లోపల గడియపెట్టాడు. వాడు, ఆ ఫూల్, ఘటక్ గాడు తను పారిపోతూ మిగతా తలుపుల్ని తెరిచిపెట్టి వుంటాడు. అందువల్లనే నీరు లోపలకు ప్రవేశించి వుండాలి.

బయటనుంచి తలుపు సందులగుండా నీరు పారుతోన్న చప్పుడు వినవస్తోంది. అతడు భయభ్రాంతులతో నోరు తెరుచుకుని, గుడ్లప్పగించి తలుపువంకే చూస్తుండి

పోయాడు. రిగ్ సముద్రమట్టంపై ఎన్నో అడుగుల ఎత్తు నుంచి పడిపోయి నీళ్ళలో ఎంతో లోతున మునిగివుందన్న మాట.

ఈ సమాధిలో తనొక్కడే ఒక్కచావు చావటానికి ఇంకా ప్రాణాలతో బ్రతికి వున్నాడన్నమాట. గదిలో ఆక్సిజన్ అయిపోయేదాకా మాత్రమే తన ఆయుః ప్రమాణం మిగిలివుంది. ఆ తర్వాత, తను పీల్చి వదిలిన కార్బన్ డయాక్సైడ్ విషవాయువునే తిరిగి పీల్చాల్సి వస్తుంది.

ఈ ప్రమాదం జరిగిన వేళావిశేషం ఎంత చెడ్డది? సరిగా తన శ్రమకు తగిన ఫలితం చేతికందబోతూండగా ఈ ఘోరప్రమాదం సంభవించింది.

ఎన్నో నెలల తరబడి జరిపిన రిసెర్చి, కోట్లకొలది ధన వ్యయం ఇదంతా బూడిదలో పోసిన పన్నీరయింది. ఈ ప్రమాదమే జరగకుండా వుంటే, ఈ పాటికి తను, ప్రస్తుతం అన్వేషణ జరిపేచోట ఆయిల్ లభ్యమౌతుందనే శుభవార్తను ప్రభుత్వానికి చేరవేసి వుండేవాడు.

కేవలం తన మాటమీదే మిశ్రా, ఇతర సైంటిస్టుల మాటని పెడచెవిన పెట్టి, ఇక్కడ అన్వేషణ జరిపేందుకు ప్రభుత్వానుమతిని తెచ్చాడు.

ఇంకా తను కొద్దిక్షణాల్లోనే చనిపోతాడు. ఈలోగా తన రీసెర్చి ఫలించిన విషయాన్ని డైరీలో రాసివుంచితే, తను చనిపోయినా, తన శ్రమ ఫలితం బయటి ప్రపంచానికి ఉత్తరోత్తరా ఎప్పటికయినా తెలియగలదు. అది మిశ్రాకు ఎంతో ఉపయోగపడగలదు.

కాగితం కలంకోసం అరుణాచలం వెనక్కు తిరిగి లేబరటరీలోకి వచ్చాడు.

నేలమీదున్న సామాన్ల కుప్పలోంచి ఏదో చలనం కనుపించింది. ఆ తర్వాత మూలుగు వినవచ్చింది. తన చెవుల్ని తనే నమ్మలేకపోయాడు అరుణాచలం. పరుగున వెళ్ళి సామాన్లు తొలగించాడు. వాటిక్రింద తన అసిస్టెంట్ ఛటర్జీ పడివున్నాడు.

"నువ్వింకా ఇక్కడే ఉన్నావా? బయటబడ్డావను కున్నానే?" అన్నాడు అరుణాచలం ఆశ్చర్యంగా.

"ఇక్కడే నేనొక్కడ్నే వున్నానేమో అను కున్నాను. మీరూ ఇక్కడ మిగిలిపోయారా?" ఛటర్జీ బాధగా మూలిగాడు.

"నీకేం పెద్దగా దెబ్బలు తగల్లేదు కదా?"

"మోకాలికేదో బలమైన దెబ్బ తగిలింది. బహుశా ఫ్రాక్చర్ గూడ అయిందేమో అనుకుంటాను." అంటూ కుంటుతూ లేచాడు ఛటర్జీ.

అరుణాచలం అతడికి చేయూతనిచ్చి, లేవదీసి కుర్చీలో కూర్చొబెట్టాడు.

మోకాలిదగ్గరనుంచి రక్తం వస్తోంది. గుడ్డపేలికను నీళ్ళలో తడిపి గాయం చుట్టూ కప్పాడు అరుణాచలం. తన నడుమునున్న బెల్టు విప్పి, గాయానికి చుట్టూ గట్టిగా బిగించి కట్టాడు.

"మనం ఇక్కడనుంచి బయటకు వెళ్ళగూడదూ?" ఛటర్జీ అమాయకంగా అడిగాడు.

"సముద్రమట్టానికి దెబ్బయ్, ఎనభయ్ అడుగుల లోతున నీళ్ళలో మునిగిపోయి వుంది మన రిగ్!" విచారంగా చెప్పాడు అరుణాచలం.

"అంటే మన గదిచుట్టూరా నీరు కమ్ముకుని వుందా?"

ఛటర్జీ ముఖంలో భయం, విచారం ఒకేసారి వ్యక్తమయినయ్.

"అవును. లోపల అంతకంతకూ చల్లదనం ఎక్కువౌతోన్నట్లుగా వుంది. ఇందాకటికన్న నాకు చలి వేస్తోంది." అంటూ అరుణాచలం హ్యాంగర్‌కి వ్రేలాడుతున్న కోటు అందుకుని తొడుక్కున్నాడు.

"నీ కాలికి మంచి మందు వేయాలి. ఫస్ట్ ఎయిడ్ బాక్స్ అలమారులో వుండాలి. ఈ గది పల్టీలు కొట్టేటప్పుడు అది క్రిందపడిపోయి ఉండాలి. అంటే అలమారు ఎదురుగా ఆ మూలనున్న కుప్పలో వుంటుంది. చూశావా నా జామెంట్రీ అంచనా!" అరుణాచలం గర్వంగా చూశాడు.

"మనం సముద్ర మధ్యంలో సజీవ సమాధి అయి వున్నాం. మీ జామెట్రీ, అల్‌జీబ్రా తెలివిని ప్రదర్శించటానికి ఇదా సమయం!" ఛటర్జీ విచారంగా చూశాడు.

"అంతకన్న మనం చేయగలిగిందేముంది. మన జీవితం కొద్ది గంటలలోకే వచ్చింది. ఈ లోపల మనల్ని ఎవరన్నా ఆదుకుని రక్షించగలరని ఆశపడుతున్నావా ఛటర్జీ!"

"అలా నిరాశగా కూర్చునే బదులు, బయట పడేందుకు ఏదైనా మార్గం దొరుకుతుందేమో ప్రయత్నించి చూడచ్చు గదా?"

అరుణాచలం ఒక్క నిముషం మౌనంగా వూరుకున్నాడు. జేబులోంచి సిగరెట్ ప్యాకెట్ తీశాడు. సిగరెట్‌ని లాగి పెదాల మధ్య పెట్టుకుని, అగ్గిపెట్టె కోసం తడుముకున్నాడు.

"అసలే ఇక్కడ గాలిలేదు. మీరు పొగ త్రాగి, ఈ వున్న కాస్త వాతావరణాన్ని కాలుష్యం చేయకండి

సార్! పోనీ ఒక పని చేయండి. అలాగే సిగరెట్ పెదాల మధ్యే వుంచుకోండి. తల్లి పాలుత్రాగే పిల్లవాడు కులి తీరటం కోసం బొటన వ్రేలు నోట్లో వుంచుకుని చీకి నట్లుగా, సిగరెట్ ని అలాగే వుంచుకుని చప్పరించండి.''

ఇద్దరూ కాసేపు మౌనంగా వుండిపోయారు. ఎవరికి వారు ఇక్కడి నుంచి బయట పడేందుకు మార్గం ఏదన్నా వున్నదా అనే ఆలోచిస్తున్నారు.

''అన్నట్టు మనకు తినేందుకు ఆహారం ఏమయినా మిగిలి వుందా?'' అరుణాచలం నిశ్శబ్దాన్ని చీలుస్తూ అడిగాడు.

''ఆహారమా? మన గదిలో బ్రెడ్ ప్యాకెట్, బ్రాందీ సీసా వున్నదనుకుంటాను. మరి నీళ్లో? కరెంటు ఆగిపోవ టంతో టాప్స్. (కొళాయిలు) పనిచేయటం ఆగిపోయాయి. విచిత్రంగా లేదూ? సామ్యూల్ కోల్ రిడ్జి పద్యం గుర్తుందా మీకు? ఏన్షంట్ మారినర్ లోది!

'ఎక్కడ చూసినా జలమయం
ప్రపంచంలోని నావలన్నిటినీ ముంచే జలం
ఎక్కడ చూసినా జలమయం
కానీ త్రాగేందుకు ఒక్క చుక్క లేదు.'

అదీ ఆ పద్య భావం. మన పనీ సరిగా అలానే అయింది కదూ?''

''ఆ! నా స్టోర్ లో డిస్టిల్డ్ వాటర్ సీసాలు చాలా వుండాలి. అవి పగిలిపోకుండా వుంటే, మనకు వుపయో గిస్తాయి'' అరుణాచలం ఆత్రంగా లేచాడు. అదృష్టం బాగుండి, డిస్టిల్డ్ వాటర్ సీసాలు, దూదిపొరల మధ్యలో పదిల పరచి వుండటంవలన అవి పగులకుండానే వున్నయ్.

అరుణాచలం కొన్ని నీళ్ళు గ్లాసులోకి వంచుకుని త్రాగాడు. మరో గ్లాసు నీళ్ళు ఛటర్జీకి తీసుకెళ్ళి

అందించాడు.

"నా కాలు బాగోలేక మీకు శ్రమ ఇవ్వాల్సి వచ్చింది సార్! థాంక్యూ వెరీమచ్!" చటర్జీ నొచ్చుకున్నాడు.

# 9

అరుణాచలం వులిక్కిపడ్డాడు. "ఏమిటా ధ్వని?"

"ఏ ధ్వని సార్? నాకేం వినపడలేదు!"

"మౌనంగా వుండి విను!" అరుణాచలం చెవులు రిక్కించి విన్నాడు.

ఎక్కడ నుంచో, చాలా దూరం నుంచి వస్తున్న ధ్వనిలా "టక్! టక్! టక్!" మని చప్పుడౌతోంది.

"మనం నీళ్ళల్లో మునిగిపోయి ఎంతసేపయి వుండవచ్చు సార్?"

"ఎవరికి తెలుసు! అరగంటే అయిందో, గంటే అయిందో?"

"గంట దాటే వుండవచ్చునేమో! ఈ లోపల రిగ్ లో కూరుకుపోయిన మనుష్యుల్ని వెదికి రక్షించేందుకు నావికాదళం వచ్చారేమో సార్!" ఛటర్జీ ఆశగా చూశాడు.

ఇద్దరూ మరోసారి ఆలకించారు. ఈ తడవ ఆ శబ్దం స్పష్టంగా వినవస్తోంది "కట్! కడకట్! కడకట్!" మోర్స్ సిగ్నల్ పద్ధతిలో సంకేతం అది. ఎవరైనా ప్రమాదంలో వుంటే పంపే సంకేతమే అది.

అంటే తామిద్దరే కాక మరో గదిలో ఇంకో వ్యక్తి తమలాగే దిగబడిపోయాడేమో!

గదిలో గోడలవద్దా, కప్పుకి దగ్గరగా గోడకూ చెవి ఆనించి విన్నాడు అరుణాచలం. ఆ శబ్దం కరెక్ట్‌గా ఏ

ప్రాంతం నుంచి వస్తున్నదో అలకించటానికి యత్నం చేశాడు.

నేలమీద వున్న ఇనుప వస్తువుని తీసుకుని గది ఇనుప గోడ మీద తనుగూడ అదే సంకేతం వచ్చేలా కొట్టాడు నెమ్మదిగా, "టక్ టకటక్! టక్!"

"ఆ శబ్దం మన వెత్తిమీదనుంచి వస్తున్నట్టుంది. మన గది పైభాగంలో ఏమున్నది?" అరుణాచలం అడిగాడు మళ్ళీ.

"మన గదికి సరిగా పైన డ్రిల్లింగ్ ఇంజనీర్ గది సార్!"

"అయితే ఆ గదిలో ఎవరో దిగబడిపోయి వుండాలి. అతడే ఈ సంకేతనాల్ని పంపుతున్నాడేమో సహాయం కోసరమై!"

అరుణాచలం మళ్ళీ మోర్స్ సంకేతం చేశాడు "టక్! టక్! ఎవరక్కడ? టక్! టక్!"

అవతలి వైపు నుంచి "టక్! టకటక్! టక్!" శబ్దం ఎక్కువయిందే కానీ అరుణాచలం ప్రశ్నకు సమాధానం రాలేదు. తను ప్రమాదంలో అంతకంతకూ పూడుకు పోతున్నట్టుగా సంకేతం ఇస్తున్నాడు అదే పనిగా.

అతడి పరిస్థితిని వూహించుకున్నాడు అరుణాచలం, తన మనసులో. ఆ గదిలో అతడొక్కడే మిగిలిపోయి వుంటాడు. పైనుంచి ఏదైనా సహాయం వస్తుందనే ఆశతో ఇప్పటిదాకా ప్రాణం బిగబట్టుకుని వుంటాడు. సహాయం రాకపోయినాగానీ, గదిలోకి నీళ్ళు పారడం ప్రారంభమైంది. ఎలాగైనా బయట పడాలన్న ఆత్రుతతో ఆ వ్యక్తి ఏ తలుపో తెరచి వుంటాడు. ఇంకేముంది? నీరు

లోపలకు జారబడి వుండాలి. నీటి ఒత్తిడికి తలుపు తిరిగి మూసేయాలన్నా వీలుపడదు. అంతకంతకూ గదిలోని నీటి మట్టం పెరుగుతూండడంతో, లోపలున్న వ్యక్తి, తనను కబళించ వస్తూన్న మృత్యువును చూసి చావు భయంతో విలవిల్లాడి పోతూ, ప్రమాద సంకేతనాన్ని పంపుతూండాలి.

నీళ్ళు అతడి పాదాలను తాకి, త్రుటిలోనే మోకాళ్ళ దాకా వచ్చి వుంటాయి. తరువాత నడుం వరకూ, భుజాల వరకూ, గడ్డం వరకూ, ఆ తర్వాత అతడు నీటితో నిండిన గదిలో శవంగా మారిపోతాడు.

పైనుంచి వస్తున్న శబ్దం ఆగిపోయింది. ఇనుప గోడకు చెవి ఆనించి విన్నాడు. ఇప్పుడు అంతా నిశ్శబ్దంగా వుంది.

అరుణాచలం తిరిగి ఛటర్జీ కూర్చున్న గదిలోకి వచ్చాడు.

"మనం చాలా సులభంగా చచ్చిపోతామేమో అని ఆశించాను ఛటర్జీ! కానీ చూస్తూ చూస్తూ ఏ వ్యక్తి తేలికగా చావటానికి ఇష్టపడడు. ఆఖరి క్షణం వరకూ పోరాడి తీరుతాడు."

. "అలాంటి అభాగ్యులింకా ఈ రిగ్ లోపల ఎందరు చిక్కుబడిపోయారో సార్?"

ఒకరి వంక ఒకరు సానుభూతిగా చూసుకున్నారు. వారి మౌనంలో భయం తాండవిస్తోంది. తమను రక్షించేందుకు ఎవరన్నా వచ్చేవరకూ తాము జీవించి వుండగలరా, అన్న అనుమానం తొంగి చూస్తోంది ఇద్దరిలో.

"ఆ తలుపు గట్టిగా మూసేశారు గదా సార్!" ఛటర్జీ తలుపు వంక చూస్తూ అడిగాడు.

"ఆ! గట్టిగానే చూశాను! ఏం అలా అడుగుతున్నావ్?"

"ఏదో కొత్త శబ్దం వస్తోంది వినండి సార్!"

అరుణాచలం వూపిరి బిగబట్టుకుని మరీ ఆలకించాడు. ఏదో శబ్దం వినపడుతోంది. అయినా అది అంత పెద్దగా రావటం లేదు. ఏవో కొన్ని వందల ఎలుకలు ప్రాకిపోతున్నట్టుగా చప్పుడు.

అది నీరు ప్రవహిస్తూన్న చప్పుడు! అంటే తమ గది చుట్టూరా నీరు కమ్ముకుంటోంది! తలుపులో ఏ మాత్రం ఎడం వున్నా నీరు ఈ గదిలోకి గూడ రావటం ఖాయం!

# 10

ఆయిల్ అండ్ నాచురల్ గ్యాస్ కమీషన్ దక్షిణ మండలం డైరక్టర్ మిశ్రా హెలికాప్టర్‌లో పైలట్ ప్రక్క సీట్లో కూర్చున్నాడు. అతడి దృష్టి సముద్రం మీదే వుంది. ఎంత త్వరగా ప్రమాద స్థావరానికి చేరుకుంటానా అని ఆతృతగా వున్నాడు అతడు.

"మనం ఎంతసేపట్లో గమ్యాన్ని చేరగలం?" అని మధ్య మధ్య పైలట్‌ని ప్రశ్నిస్తున్నాడు.

"వాతావరణంలో అవరోధాలేవీ లేకుండా వుంటే ఒక గంటలో చేరగలం సార్!"

మరో అరగంట భారంగా గడిచింది.

పైలట్ వైర్‌లెస్‌లో అరుస్తున్నాడు. "హెలికాప్టర్ మారుతి! కాలింగ్ ఎస్. ఎస్. రాజేంద్ర! హెలికాప్టర్ మారుతి! కాలింగ్ ఎస్. ఎస్. రాజేంద్ర!"

"ఎస్. ఎస్. రాజేంద్ర! కెప్టెన్ మాట్లాడుతూంట! ఎవరు మీరు!" షిప్‌లోంచి సమాధానం అందింది. వైర్

లెస్ రేంజ్‌లోకి వచ్చారన్నమాట అనుకున్నాడు మిశ్రా.

"డైరక్టర్ మిశ్రాగారు వస్తున్నారు హెలికాప్టర్‌లో. నౌక మీద ఫ్లాష్ లైట్లు వెలిగించండి, పైనుంచి దిగటానికి బాగా కనబడేలా!"

అప్పటికి రాత్రి బాగా ప్రొద్దుపోయింది.

'రాజేంద్ర' నౌక చిన్నది. దానిమీద లాండింగు ప్యాడ్ లేకపోవడంవల్ల, హెలికాప్టర్ దానిమీద దిగటానికి వీల్లేకపోయింది.

నౌక డెక్ పైభాగాన హెలికాప్టర్ వలయాకారంగా ఎగురుతోంది. తనతో తెచ్చిన డైవింగ్ పరికరాలను మూట గట్టి తాడుతో షిప్ మీదకు జారవిడిచాడు మిశ్రా ముందుగా. తర్వాత తాడు చివరన వున్న హుక్ మీద కూర్చున్నాడు తను.

హెలికాప్టర్‌లోంచి తాడు క్రిందకు జారుతోంది. మిశ్రాకు అదో కొత్త అనుభవం. తను ఎన్నడూ విమానంలోంచిగానీ, హెలికాప్టర్‌లోంచిగానీ సముద్రంలోని నౌక మీదకు దూకి ఎరగడు. అతడి శరీరంలో ప్రతి రోమమూ ఆత్రుతతో నిక్కబొడుచుకుంది.

డెక్ మీదనుంచి నాలుగడుగుల ఎత్తులో వుండగా మిశ్రాకి సాయం చెయ్యటానికి పరుగెత్తుకొచ్చారు నావికులు. వాళ్ళ ఆసరాతో హుక్ మీదనుంచి డెక్ మీదకు దూకాడు మిశ్రా.

కెప్టెన్ నారాయణ, మిశ్రాను గ్రీట్ చేశాడు.

"ఎక్కడ రిగ్ మునిగిపోయింది? చూపులకేమైనా మిగిలిందా? అంతా నీళ్ళలో మునిగిపోయిందా?" మిశ్రా ఆత్రుతగా అడిగాడు.

"అంతా మునిగిపోయింది సార్! అదుగో అక్కడ నాలుగు పడవల్లో ఎర్రగా డేంజర్ లైట్లు వెలుగుతు న్నాయి చూశారా? ఆ మధ్యలోనే మునిగిపోయింది 'సాగర చక్రవర్తి'. ఇతర నౌకలు అక్కడకు వచ్చి, నీళ్ళలో మునిగిన రిగ్ కి ఢీకొనకుండా కాపలా వుంచాను సార్!"

"మంచి పని చేశారు. ఇంతకీ రిగ్ ఎటుప్రక్కగా కూలిపోయింది కుడివైపుగా, ఎడమ వైపుగా?"

"ఎడమ వైపుకే సార్!"

"అంటే లేబరటరీ వింగ్ వైపే గదా? అప్పుడు రిగ్ ఎడమ ప్రక్కకు వాలిపోయింది. కనుక ప్రయోగశాల (లేబరటరీ) ప్రస్తుతం రిగ్ పడిపోయి వున్న స్థితిలో అట్టడుగున వుండి వుంటుంది!"

"అంతే సార్!"

"నీళ్ళలోకి దూకి పని చేయగల ఫ్రాగ్ మెన్, గజ ఈతగాళ్ళు సిద్ధంగా వున్నారా? వాళ్ళు తక్షణమే లేబ్ దగ్గరకు పోవాలి!" మిశ్రా హడావిడి చేశాడు.

"మీరు మరోలా భావించకుండా వుంటే నాదో సలహా సార్! ఇంకా తెల్లవారటానికి మూడు గంటలు వ్యవధి వుంది. ఈ చీకట్లో ఎంతటి ఈతగాళ్ళయినా రిగ్ అడుగంటుకీ నీళ్ళలోకి పోవటం ప్రమాదంతో కూడు కున్న పని! అందుకని మనం తెల్లారేదాకా ఆగితే బాగుం టుందేమోనని!" కెప్టెన్ నారాయణ నసిగాడు.

"నాన్సెన్స్! ఇప్పుడు నాకు కావలసింది సలహాలు కాదు ఇచ్చిన ఆజ్ఞల్ని పాటించడమే!" మిశ్రా చిరాకు పడ్డాడు.

"సరే మీ ఇష్టం!" అంటూ ఫ్రాగ్ మెన్ని పిలిపిం చాడు కెప్టెన్.

"మీ ప్రాణాలకొచ్చిన భయం ఏమీ లేదు! నా వెంట అత్యాధునికమైన డైవింగు సూట్లను తెచ్చాను" అంటూ మిశ్రా తను తెచ్చిన డైవింగ్ పరికరాల్ని వూడదీయించాడు.

ఫ్రాగ్ మెన్‌లు ముగ్గురూ వాటిపట్ల తమ వుత్సుకతను వెల్లడించారు.

"రిగ్ ఎంత లోతున ఉండవచ్చని మీ అంచెనా?"

"సుమారు ఎనభయ్, తొంభై అడుగులు సార్!"

"ఏమైనా మీరు ఈ ఫ్రాగ్ మెన్‌ల ప్రాణాలతో చెలగాటం ఆడుతున్నారు!" స్వగతంలా గొణిగాడు కెప్టెన్ నారాయణ.

"ఇప్పుడు ఏమాత్రం ఆలస్యం జరిగినా, అది ఇంకా ప్రమాదకరం! మన ముందున్న ప్రతి క్షణం అతి విలువైనది. రిగ్ లోపల ఆక్సిజన్ అయిపోతూండవచ్చు. లేదా గది గదికీ నీరు చేరుతూండవచ్చు. తెల్లారేసరికి లోపల ఎవరూ సజీవంగా ఉండకపోవచ్చు!"

"ఒకరిద్దరి కోసం ఇదంతా ఎందుకా అని!"

"ఈ అన్వేషణ ఫలితాలన్నీ ఆ వ్యక్తుల మీదనే పూర్తిగా ఆధారపడి వుండటం మూలాన ఈ శ్రమంతా!" అంటూ మిశ్రా 'సాగర చక్రవర్తి' లోపలి ప్లాన్ తీసి బల్లమీద పరిచాడు.

ఫ్రాగ్ మెన్‌లకి లేబరేటరీ రిగ్‌లో ఎటు ప్రక్కన వున్నదో వివరించాడు.

ఫ్రాగ్ మెన్‌లు ముగ్గురు డ్రెస్ వేసుకున్నారు. ఒక్కొక్కని వీపుకి రెండేసి ఆక్సిజన్ సిలెండర్స్ వున్నయ్. నడుముకున్న బెల్టులో, ఇతర పరికరాలున్నయ్. తలకు

మాస్క్, కళ్లు కనిపించేలా ముఖం మీదకు గ్లాస్, నోటి వద్ద ఫోన్ మౌత్ పీస్, నీటిలో వెదికేందుకు పవర్ ఫుల్ టార్చ్, త్రోవ తప్పిపోకుండా వుండగలందులకు నాకకూ అతగాడికీ పెద్దవైర్ కట్టబడింది.

ఫ్రాగ్ మెన్ లు ముగ్గురూ నీళ్ళలోకి దూకారు. వాళ్ళు మునిగిపోగానే మిశ్రా, నారాయణలు చెవులకు ఇయర్ ఫోన్స్ తగిలించుకుని క్రిందనుంచి వచ్చే సంకేతాలను ఆత్రంగా వినసాగారు.

"ఇరవయ్ అడుగులు... వైర్ ని ఇంకా వదలండి సార్! ముప్ఫయ్ అడుగులు...ఏమీ అందలేదు సార్...నలభయ్ అడుగులు...ఏదో దూరంగా కనుపిస్తోంది...బహుశా రిగ్ అయి వుండాలి...సారీ సార్! అది రిగ్ కాదు...రిగ్ కాలు మాత్రమే! రిగ్ కోసరం ఇంకా క్రిందకు పోతున్నాం సార్!"

"ఓకే! ప్రొసీడ్! మీ నడుముకున్న వైర్ రిగ్ కాళ్ళకు తగులుకుని మెలిక పడకుండా జాగ్రత్త పడండి!" కెప్టెన్ నారాయణ హెచ్చరించాడు ఫ్రాగ్ మెన్ లని.

"యాభై...అరవై...డెబ్బయ్... అడుగుల లోతులో వున్నాం సార్! ఏదో పెద్ద భోషాణంలాగ కనబడుతోంది సార్! బహుశా రిగ్గయి వుండాలి! దాని చుట్టూ నీరు కమ్ముకుని వుంది. లోపలంతా గూడా ప్రవేశించి వుంటయ్!"

"లేబరటరీ రూమ్స్ నెంబర్లు గుర్తున్నాయా? రిగ్ ప్లాట్ ఫారమ్ మీదనుంచి లోపలకు మెట్లున్నయ్. కారిడర్ లోకి వెళుతుంటే కుడిచేతి ప్రక్కన మూడో ద్వారం!"

"అలాగే సార్! వైర్ ఇంకా వదలండి సార్ నేను

ఇంకా దిగువకు పోయేందుకు వీలుగా!" ఫ్రాగ్ మెన్ రెండు అరిచాడు.

"ఓ కే! ఓ కే! గది తలుపులు బిగుసుకుని వుండచ్చు. అందుకని గది గోడ మీద సుత్తితో మోర్స్ కోడ్ లో సంకేతాలు పంపండి! ఇనుపగోడలు కనుక ఆ మోత లోపలికంటా వినబడుతుంది!"

"కారిడర్ లోకి అడుగుపెట్టాను సార్! మోర్స్ లో సంకేతాల్ని పంపుతున్నాను...టక్...టక్...టక్!"

"నీ సంకేతాలు నాకూ వినబడుతున్నయ్. లోపల్నుంచి వెంటనే బదులు రాకపోవచ్చు! కొద్దిసేపు అలానే సంకేతాలు పంపుతూండండి! లోపలున్నవాళ్ళు నిరాశా, నిస్పృహాలతో, చనిపోవటానికి సిద్ధపడుతూ వుండచ్చు! మన సంకేతాలు వినబడినా, తాము వింటూన్నది నిజమా, భ్రమా అనే సంశయంలో కొంచెంసేపు తటపటాయించటం సహజం!"

# 11

బయట నుంచి మళ్ళీ శబ్దం వినవచ్చింది.

"టక్ టక్! ఎవరన్నా ప్రాణాలతో వున్నారా?" మోర్స్ కోడ్ లో ప్రశ్న.

ఆ ప్రశ్నను అరుణాచలం అర్థం చేసుకోలేకపోయాడు. ఛటర్జీకి మోర్స్ బాగా వచ్చును. అతడు ఎగిరి గంతేశాడు. కుంటి కాలుని ఈడ్చుకుంటూ గోడవారగా వచ్చాడు. అరుణాచలం చేతిలోని రెంచీని లాక్కుని తను గోడమీద తట్టి, బదులు చెప్పాడు.

"టక్ టక్! హలో! మా సంకేతాలు అందుతున్నాయా?"

"టక్ టక్! ఎవరు మీరు? లోపల ఎందరున్నారు? టక్ టక్!"

గది లోపలనుంచి బయటకూ, బయటనుంచి లోపలకూ మోర్స్ కోడ్‌లోనే సంభాషణ సాగుతోంది. అరుణాచలం అయోమయంగా ఛటర్జీ ముఖంలో మారుతూన్న రంగులవంకే చూస్తూండిపోయాడు.

"టక్ టక్! ఇద్దరం ఉన్నాం! టక్ టక్!"

"టక్ టక్ ఎవరెవరు? టక్ టక్?"

"సైంటిస్ట్ అరుణాచలం, అతడి అసిస్టెంట్ ఛటర్జీ!"

"అలాగా! ఈ విషయం షిప్‌లోకి తెలియపరుస్తాను."

"మమ్మల్ని రక్షించే మార్గమేదైనా ఉందా?"

"ఆ ప్రయత్నంలోనే ఉన్నాం!"

"ఎంతసేపు పడుతుంది?"

అవతలివైపు ఫ్రాగ్ మెన్ ఒక్కక్షణం యోచించాడు. "సుమారు మూడు నాలుగు గంటలు పట్టచ్చు! టక్ టక్."

ఆ తర్వాత బయటనుంచి సంకేతం రాలేదు. బహుశా ఫ్రాగ్ మెన్ వెళ్ళిపోతూండాలి అనుకున్నాడు ఛటర్జీ.

ఆత్రుతగా చూస్తున్న అరుణాచలానికి క్లుప్తంగా తమ సంభాషణలోని సారాంశాన్ని వివరించాడు ఛటర్జీ.

"ఇంకా ఈ నరకంలో మూడు నాలుగు గంటలు మగ్గితేగానీ, మనం బయటపడలేమా?" నిట్టూర్చాడు అరుణాచలం.

"మనల్ని రక్షించటానికి వాళ్ళు ఎంతో ప్రయాసపడవలసి ఉంటుంది. పైగా ప్రత్యేకమైన పరికరాలు అమర్చుకోవలసి ఉంటుంది. అబ్బా! ఈ కాలునొప్పి భరించలేనంతగా ఎక్కువౌతోంది సార్ అంతకంతకూ!"

అరుణాచలం తన ఆలోచనలో మునిగిపోయాడు. ఇంకా మూడు నాలుగు గంటలు! అతిభారమైన గంటలు నాలుగు! బహుశా ఠిగ్ కూలిపోయి ఏడెనిమిది గంటలు అయివుండచ్చేమో! కానీ తన ప్రాణానికి ఏడెనిమిది యుగాలు గడిచినట్టుగా ఉంది.

ఈ సజీవ జల సమాధిలోంచి ఎప్పుడు బయటపడ తామా, ఎప్పుడు బయట ప్రపంచాన్నీ, సూర్యుడి వెలుగునీ, క్రిక్కిరిసిన రోడ్లనూ, ఆకాశాన్నంటే మేడల్నీ, రొద చేస్తూ వేగంగా పరుగెత్తే కార్లనీ, న్యూస్ పేపర్నీ, కమ్మని భోజనాన్నీ, వీటన్నిటినీ ఎప్పుడు చూస్తానా అని ఆతృత పడుతున్నాడు అరుణాచలం.

అన్నిటికన్న మిన్నగా, తన భార్యను పిల్లల్నీ చూసు కోవాలని అతడు వేగిర పడసాగాడు.

"అయ్యో? ఏమిటూ పరాకు అరుణాచలం సారూ?" ఛటర్జీ అరుపుతో ఈ లోకంలోకి వచ్చిపడ్డాడు అరుణా చలం.

"ఏమిటన్నావ్? నీ కాలు బాధగా ఉందా? కాలి కున్న కట్టు రక్తంతో తడిసిపోయినట్టుంది. అది ఊడదీసి, మరో పాడిగుడ్డ కడతాను! అంతకన్న నావల్ల అయ్యే దేముంది?"

అరుణాచలం మరో గుడ్డపేలికను ఛటర్జీ గాయానికి కట్టాడు. రక్తస్రావం ఆగిపోయి గాయం చుట్టూరా రక్తం గడ్డకట్టుకుపోయి ఉంది, పాతకట్టు ఊడదీసేసరికి.

కట్టుకట్టటం పూర్తయేసరికి, అరుణాచలానికి దగ్గు తెర వచ్చింది. గట్టిగా దగ్గుతూ, మాడుమీద చేత్తో కొట్టు కున్నాడు.

"పొల మారింది. నా గురించి నా భార్య ఆందోళన చెందుతూన్నదేమో!" అరుణాచలం సిగ్గుపడుతూ అన్నాడు.

ఛటర్జీ నవ్వాడు. "అది పొలమారటం కాదుసార్! ఇప్పుడు మనకు మరో కొత్త ప్రమాదం ఎదురవబోతోంది. ఈ గదిలోని ఆక్సిజన్ అయిపోవచ్చింది. మనం పీల్చి వదలిన కార్బన్ డయాక్సైడ్‌తో గది నిండిపోతోంది!"

అరుణాచలం భయంగా చూశాడు. "అయితే మన మిప్పుడేమిటి చేయటం?"

"వాళ్లు వచ్చేదాకా మనం చేయగలిగిందేమీ లేదు. మాట్లాడకండి! కదలకుండా పడుకోండి! వీలైతే నిద్ర పోవటానికి యత్నించండి! శ్రమపడే వ్యక్తికన్నా, నిద్ర పోయే వ్యక్తి తక్కువ గాలిని పీలుస్తాడు."

"ఈ స్థితిలో నిద్రరాదు. అయినా మౌనంగా కదలకుండా ఉండటానికి యత్నిస్తాను. వాళ్ళు వచ్చేదాకా మన ప్రాణాలు నిలుస్తాయా."

అరుణాచలం, ఛటర్జీ మౌనంగా ఒకరొన్నొకరు చూసుకుంటూ కూర్చుండిపోయారు.

# 12

మునిగిపోయిన రిగ్‌లోంచి చిక్కుబడిన మనుష్యుల్ని రక్షించేందుకై సాయంగా మరో నౌక 'ఎస్. ఎస్. అశోక్' వచ్చి చేరింది ఆ ప్రాంతానికి.

అందులో ఇంకా అనేకమంది ఫ్రాగ్ మెన్‌లు నీటిలో ఈదగలవాళ్ళు చాలామంది వున్నారు.

'ఎస్. ఎస్. అశోక్' డెక్ నిండా, ఇనుమును కోసే పరికరాలు టెలిఫోన్ సాధనాలు, వైర్ రోప్స్, ఇనుముతో

కంతలు పొడవగల ప్రత్యేకమైన గన్స్, హోస్ పైప్‌లూ, ఇంకా నీటిలో మునిగిపోయిన వారిని రక్షించటానికి అవసరమయ్యే సామగ్రితో నిండిపోయి ఉంది.

గాలినింపిన రబ్బర్ బోటుని నీళ్ళమీదకు దించారు. అందులోనుంచే డైవర్స్ నీళ్ళలోకి దిగుతారు.

తాత్కాలిక కంట్రోల్ రూమ్ ఎస్. ఎస్. రాజేంద్ర నౌక డెక్ మీద ఏర్పాటు చేయబడింది. ఇయర్‌ఫోన్స్‌తో ఆఫీసర్లు మిషన్ల ముందు కూర్చుని ఉన్నారు. మరికొందరు బైనాక్యులర్స్‌తో సముద్రంమీదకు చూస్తున్నారు.

రిగ్ ప్లాన్‌లోకి చూస్తున్నారు డైరెక్టర్ మిశ్రా, కెప్టెన్ నారాయణ, 'ఎస్. ఎస్. అశోక్' నౌక కెప్టెన్ భూపతి.

ఆ ప్లాన్‌లో అరుణాచలం ఉన్న లేబరటరీ ఎర్రసిరాతో గుర్తుపెట్టబడింది.

"మన అంచెనాల ప్రకారం రిగ్ ఒకప్రక్కకు ఒరిగి పోయింది. వాళ్ళను రక్షించేముందు రిగ్‌ని సరిగా పొజిషన్ లోకి త్రిప్పితే బాగుంటుందేమో?" డైరెక్టర్ మిశ్రా అడిగాడు.

"అది అసంభవం! మనవద్ద ఉన్న రెండు నౌకల శక్తి కూడ చాలదు దాన్ని తిరగదోడటానికి!" కెప్టెన్ భూపతి తల అడ్డంగా ఊపాడు.

"అందులోని వ్యక్తులు గత ఏడెనిమిది గంటలనుంచీ లోపలే చిక్కుకుపోయారు. ఆ గదిలోని ఆక్సిజన్ అయి పోయే ప్రమాదం ఉంది. తాము పీల్చి వదలిన కార్బన్ డయాక్సైడ్‌ని తిరిగి పీల్చి, నెమ్మదిగా మృత్యుదేవత ఒడిలోకి జారుకుంటారు!"

"కనుకనే ముందుగా మనం ఆ గదిలోకి ఆక్సిజన్ని పంప్ చేయాలి. ఆ తర్వాత మనం ఎంత టైమ్ తీసుకున్నా ఇబ్బంది ఉండదు. అందుకోసం మన డైవర్స్ నీళ్ళలోకి వెళ్తున్నారు. రిగ్ లో లేబరటరీ గదిలోకి స్పెషల్ గన్ తో షూట్ చేసి ఒక రంధ్రాన్ని చేస్తారు. రంధ్రానికి హోస్ పైప్ బిగించబడుతుంది. ఆ హోస్ ద్వారా నౌకలో పంపింగ్ ఇంజన్ల ద్వారా, ఆక్సిజన్ పంపబడుతుంది."

"అప్పుడు ఇక వారి ప్రాణాలకు అపాయం ఉండదు. వాళ్ళను రక్షించేందుకు మనకు ఎక్కువ వ్యవధి పట్టినా ఇబ్బంది ఉండదు కదూ?" డైరెక్టర్ మిశ్రా కళ్ళు ఆనందంగా మెరిసినయ్.

"ఆ తర్వాతనే ఇంకా కష్టతరమైన పని మిగిలి ఉంది. లోపల చిక్కుకుపోయిన వాళ్ళను ఎలా వెలికితీయాలా అనేదే! వాళ్ళకోసరం ఇనుపగోడల్ని బ్రద్దలుకొట్టి ద్వారం ఏర్పరచినా, వెంటనే నీరు ఉధృతంగా లోపలకు ప్రవేశిస్తుంది. ఆ పీడనానికి వాళ్ళిద్దరూ బల్లుల్లా నేలకు కరుచుకుపోతారు. వాళ్ళను వెలికి లాగేలోపలే ఇద్దరూ చనిపోవచ్చు" కెప్టెన్ నారాయణ తన భయాన్ని వెల్లడించాడు.

అందరూ ఒక్కక్షణం ఆలోచించారు. "నాకు ఒక ఆలోచన తోస్తున్నది. మన ఆలోచన ఏమిటంటే, వారున్న గదికిపైన ఇనుపగోడల్ని బ్రద్దలుకొట్టి ద్వారం ఏర్పరచాలని! నా ఉద్దేశ్యం ఏమిటంటే, గదికి పైభాగాన కాకుండా, క్రిందభాగంలో ద్వారం ఏర్పరచాలి. అప్పుడు నీరు క్రింది నుంచి పైకి క్రమేపీ, ఒత్తిడి అధికం అవుతున్నకొద్దీ, మట్టం పెరుగుతూ, గదిని నింపుతయ్. మనవాళ్ళు ఏదో సాధనాన్ని ఆధారంచేసుకుని వాళ్లు నీళ్ళలో మునిగిపోకుండా కాపాడుకోగల గాలి,

ఆ గదిని నీళ్ళతో నింపేయటానికి ఎంత వ్యవధి పడు తుందో అంచెనా వేయాలి. నీరు గదిలో సగంవరకూ రాగానే, పైనుంచి మనం మరో ద్వారాన్ని ఏర్పరిస్తే, క్రిందినుంచి పైకి ఉబుకుతున్న నీటిమట్టంలో తేలియాడు తున్న ఇద్దరు వ్యక్తులనూ, పైకి లాగేయాలి. వాళ్ళకు సత్వరంగా. ఆక్సిజన్ మాస్క్ల్ని తలకు తొడుక్కునేలా చేయాలి. ఆ తర్వాత వారిని పైకి సురక్షితంగా చేర్చ వచ్చు!'' కెప్టెన్ భూపతి అందరివంకా చూశాడు.

అందరూ తలాడించారు ఆమోదం సూచిస్తూ.

''మన ఫ్రాగ్ మెన్లు రిగ్ని చేరుకున్నారు. వాళ్ళ సంభాషణల్ని వినాలంటే ఇయర్ ఫోన్స్ తగిలించు కోండి!'' కెప్టెన్ నారాయణ హెచ్చరించాడు.

ముఖ్యమైన అధికారులంతా ఇయర్ ఫోన్స్ తగిలించు కున్నారు. నీటి అడుగున రిగ్ క్రిందిభాగానికి చేరిన ఫ్రాగ్ మెన్లు అప్పటికే రిగ్లోకి రంధ్రాన్ని చేశారు. హోస్ పైప్ దానికి బిగించారు.

లేబరటరీ గదిలోకి ఆక్సిజన్ సరఫరా మొదలయింది. మరో రంధ్రంద్వారా టెలిఫోన్ గొట్టం అమర్చబడింది.

''హలో! హలో! మా మాటలు వినవస్తున్నాయా? సమాధానంగా మూడుసార్లు గోడమీద తట్టండి సార్!'' ఫ్రాగ్ మెన్ మౌత్ పీస్లో అరచాడు.

''మీ గదిలోకి ఆక్సిజన్ని పంప్ చేస్తున్నాం. ఇక మీ ప్రాణాలకు ఎలాంటి భయమూ లేదు. వీలైనంత త్వరలో మిమ్మల్ని ఆ బందిఖానాలోంచి విడుదల చేసేందుకు యత్నాలు చేస్తున్నాం. మా మాటలు అర్థమైనాయా? అయితే మూడుసార్లు గోడమీద టాప్ చెయ్యండి!''

లోపల గదుల్లోంచి సుత్తితో ఇనుప గోడమీద మూడు సార్లు తట్టిన శబ్దం వినవచ్చింది ఫ్రాగ్ మెన్ కి.

"హాలో కెప్టెన్ సార్! ఆక్సిజన్ పైపులు బిగించటం పూర్తయింది. మన ప్లాన్ లో మొదటి పథకం పూర్తయింది, తర్వాత ఏంచేయాలో ఆర్డరివ్వండి సార్!" ఫ్రాగ్ మెన్ నౌకమీది కెప్టెన్ నుద్దేశ్యించి మాట్లాడాడు.

డెక్ మీదున్న వారంతా మనసు తేలికైనట్టుగా గాలి పీల్చుకున్నారు ఊపిరితిత్తుల నిండా.

"హలో ఫ్రాగ్ మెన్! మీ పని సానుకూలం చేసినందుకు మా అందరి అభినందనలు! ఇక మీరు పైకి వచ్చేయండి, రెండో జట్టు అక్కడకు చేరుకోంగానే! ఆ జట్టులో వెల్డర్స్, మెకానిక్స్, ఇంజనీర్లు ఉన్నారు. వారు లేబ్ గోడ పగులగొట్టి, అడుగుభాగంలో ద్వారం ఏర్పరుస్తారు." కెప్టెన్ భూపతి బదులు పలికాడు ఫోన్ లో.

"ఇప్పుడు రెండు జట్లుగా వెడుతున్నారు ఫ్రాగ్ మెన్. ఒక జట్టు లేబ్ అడుగుభాగంలో ద్వారం ఏర్పరుస్తారు. ఆ తరువాత కొద్దిక్షణాల్లో రెండో జట్టు లేబ్ పైభాగంలో మరో ద్వారాన్ని తెరుస్తారు. అందులోంచి లోపల చిక్కుకుపోయిన ఇద్దర్నీ వెలికితీసి రక్షిస్తారు" కెప్టెన్ భూపతి వివరించాడు డైరెక్టర్ మిశ్రాకి.

# 13

"ఛటర్జీ! ఛటర్జీ!" అంటూ తట్టి పిలిచాడు అసిస్టెంట్ ని.

ఛటర్జీ అతి ప్రయత్నంమీద కళ్ళు తెరిచాడు. "ఏమిటి సార్? ఇంకా మనం చనిపోలేదా?"

"మనకోసం వాళ్లు వచ్చారు. మన గదిలోకి ఆక్సిజన్ ని పంప్ చేయబోతున్నారు తెలుసా?"

అంతలో ఏదో బలమైన వస్తువు గది ఇనుపగోడకు తగులుకుంది. బాంబ్ ప్రేలినట్టుగా శబ్దం వినవచ్చింది. గది లోపల గోడకు రంధ్రం చేసుకుంటూ కొనదేలిన బిరడా లాంటిది చొచ్చుకువచ్చింది.

ఆ బిరడాను మరలాగ త్రిప్పితే ఊడిపోతుందనీ, ఆ తర్వాత పైప్‌లోంచి ఆక్సిజన్ లోపలకు సరఫరా అవుతుందనీ బయటనుంచి సంకేతం వచ్చింది.

ఆ బిరడా మర ఒకపట్టాన తిరగలేదు. అరుణాచలం దాదాపు ఇరవయ్ నిమిషాలు శ్రమపడ్డాక ఊడింది.

ఆక్సిజన్ రాకకోసం ఎదురుచూస్తూ కూర్చున్నాడు అరుణాచలం. కొద్దిక్షణాల్లో అతడికి దుర్వాసన వేసింది.

"భగవాన్ ఏమిటది? ఆక్సిజన్‌ని బదులు మరో వాయువును పంపుతున్నారా పొరబాటున! ఆక్సిజన్ సిలెండర్ అనుకుని మరో గ్యాస్ సిలెండర్‌కీ పైప్ కనెక్షన్ ఇచ్చారా?" అని భయపడ్డాడు అరుణాచలం.

ఛటర్జీ కొత్త శక్తిని పుంజుకున్నవాడిలా కదిలాడు' అప్పుడే ఈ లోకంలోకి వచ్చినవాడిలా ఉన్నాడు.

"ఛటర్జీ! ఏమిటీ వాసన? ఇది ఆక్సిజన్‌లా లేదే?"

ఛటర్జీ నవ్వాడు అతడి నవ్వుచూస్తే అరుణాచలానికి అరికాలిమంట నెత్తికెక్కింది.

"సారీ సార్! మనం గత కొద్ది గంటలనుంచి చెడు వాయువు పీల్చి ఉండటం మూలాన్న మనకు వాసనపట్టే శక్తి నశించింది. ఇప్పుడు కొత్తగా ఆక్సిజన్ లోపలకు రావటంతో, లాబ్‌లోని వాసనల స్వరూపం తెలుస్తున్నది. మీకు తగిలే దుర్గంధం మీ నుంచీ, నా నుంచీ, లాబ్‌లోని కెమికల్స్‌నుంచీ వస్తున్నది" ఛటర్జీ బదులు చెప్పాడు.

"అవును సుమా! ప్రాణభయంతో నా మెదడు మొద్దు బారిపోయింది సుమా! నీవు చెప్పిందే కరెక్ట్! అయినా ఈ చెడువాసన ఎంత సేపులే! వాళ్ళు రెండో రంధ్రం చేశారు. అందులో ఎగ్జాస్ట్ ఏర్పాటు చేశారు. అందులోంచి చెడు వాయువు వెళ్ళిపోతుంది" అరుణాచలం ఛటర్జీ తెలివిని మెచ్చుకున్నాడు.

"హలో! అరుణాచలం! నేను, మిశ్రాను మాట్లాడు తూంట! ఇప్పుడు ఆక్సిజన్ లోపలకు వస్తోంది కదూ? ఇది వరకటికన్న హాయిగా వుండాలి! ఛటర్జీ ఎలా వున్నాడు? మీకిక ప్రాణభయం లేదు. వీలైనంత త్వరలో మిమ్మల్ని వెలికితీస్తాం!" డైరక్టర్ మిశ్రా మాటలు వినిపించ ఆగి పోయినయ్.

అరుణాచలానికి ఆనందం అవధులు లేకుండా పోయింది.

"ఛటర్జీ! ఇంతదాకా అసలు విషయాన్ని మరిచాను. మనం డ్రిల్ చేస్తున్న చోట నూనె దొరికే ఆధారం లభించిందని మిశ్రాకు చెప్పే అవకాశం వుంటేనా?"

"సార్! మీరక్కడే పప్పులో కాలు వేస్తున్నారు. ఆ రిపోర్టు కోసమే మిశ్రా మన ఇద్దరి ప్రాణాలకు విలువ వుంచాడు. ఎంత ఖర్చయినా వెనుకాడకుండా, మనల్ని వెలికి తీయించే ఏర్పాటు చేస్తున్నాడు. మనం బయట పడక ముందే ఆ వార్తను మిశ్రాకు చేరవేస్తే, తరువాత మిశ్రాకు మనల్ని రక్షించే ప్రయత్నంలో ఆసక్తి తగ్గిపో వచ్చు!" ఛటర్జీ అభ్యంతరం చెప్పాడు.

"నాన్సెన్సు! నీ అనుమానానికి అర్థం లేదు. మిశ్రాకు నేనంటే అరో ప్రాణం! నా కోసం ఎంతటి త్యాగమైనా చేస్తాడు, ఎంతకైనా తెగిస్తాడు తెలుసా?" అరుణాచలం

కోపంగా చూశాడు.

కొంతసేపు ఇద్దరి మధ్యా నిశ్శబ్దం తాండవించింది. బయట నుంచి ఇంకేమైన వార్తలుగానీ, సందేశాలుగానీ వస్తాయేమో అని ఎదురుచూస్తూ కూర్చున్నారు.

"హలో అరుణాచలం! హలో ఛటర్జీ! సముద్రం మీద పెనుతుఫాను రేగబోతోంది. కనుక తుఫాను తగ్గేదాకా మేం ఏమీ చేసే స్థితిలో లేం! మీ గదిలోని రంధ్రాలకు మూతల్ని బిగించండి. హోస్ పైపుల్ని తీసేస్తున్నాం! లేకుంటే గాలి వుధృతానికి అవి తెగిపోయి, ఆ రంధ్రాల్లోంచి నీరు మీ గదిలోకి జొరబడతయ్! కనుక రంధ్రాలను మూసేయండి. మీ గదిలో మీకు అయిదు గంటలకు సరిపడా ఆక్సిజన్ చేరి వుంది. ఈ లోపల తుఫాను తగ్గంగానే మేం మళ్ళీ మీకు సాయపడతాం!" కెప్టెన్ భూపతి కంఠం స్పీకర్‌లో వినిపించింది.

ఛటర్జీ భయంగా చూశాడు అరుణాచలం కళ్ళలోకి.

# 14

కెప్టెన్ భూపతి వాతావరణంలో మార్పుని గమనించాడు. అయినా అతడు ఫ్రాగ్ మెన్‌ని వెనక్కి పిలువలేదు. లాబ్‌లోకి ఆక్సిజన్‌ని పంప్ చేస్తేగాని, రిగ్‌లో ఇరుక్కుపోయిన వాళ్ళకు రక్షణ వుండదు. అందుకై ఆపని పూర్తయేదాకా వేచి వున్నాడు.

బరామీటరు పూర్తిగా పడిపోయింది. రేడియోలో తుఫాను హెచ్చరికలు వినవస్తున్నయ్. సముద్రం గంభీర ప్రశాంతతలోకి వచ్చింది.

మరో గంటకు తమ పథకంలో మొదటి మెట్టు పూర్తయింది. రబ్బరు బోటులో వున్నవారికీ, నీటి అడుగున

వున్న వారందరికీ తుఫాను హెచ్చరికను పంపాడు భూపతి. నావికులూ, ఇంజనీర్లు, ఈతగాళ్ళు అందరూ 'ఎస్. ఎస్. అశోక్' డెక్ మీదకు చేరుకున్నారో లేదోగాని అకస్మాత్తుగా, వుధృతంగా వీచనారంభించింది.

సముద్రంలో అలలు పెద్దగా లేస్తున్నయ్.

అంత పెద్ద షిప్ గూడ ఆ అలల తాకిడిలో ఊగిపోతోంది. అల లేచినపుడు డెక్ అంతటా నీళ్ళు వచ్చి పడుతున్నయ్. అంతలోనే వెనక్కు జారి సముద్రంలో పడుతున్నయ్. తడి డెక్ మీద పరుగెత్తుతున్న మనుష్యుల కాళ్లు జారుకున్నయ్. హ్యాండ్ రెయిల్స్ ఆసరగా పుచ్చుకుని అటూ ఇటూ తిరుగుతున్నారు కొందరు, తుఫానునుంచి నౌకను భద్రపరచే ఏర్పాట్లు చేస్తూ.

"ఈ తుఫాను రిగ్ పొజిషన్ ని మార్చిందంటే, మన పని గోవిందా!" అన్నాడు కెప్టెన్ నారాయణ.

రెండు గంటల ఉధృతం తర్వాత తుఫాను తగ్గిపోయింది. అల్లకల్లోలం సృష్టించిన సముద్రం, ఏమీ ఎరగని పెద్ద ముత్తెదువలా తిరిగి ప్రశాంతతను పుంజుకుంది.

కెప్టెన్ భూపతి పబ్లిక్ అడ్రెస్ స్పీకర్ లో ఉత్తరువులు జారీ చేశాడు రిగ్ ఆపరేషన్ ప్రారంభమవుతుందని.

బోట్లలో ఇంజనీర్లు, ఫ్రాగ్ మెన్ రిగ్ మునిగిపోయిన చోటికి చేరుకున్నారు.

ఒక జట్టు ఫ్రాగ్ మెన్ నీళ్ళలోకి దూకారు. తుఫానులో రిగ్ తలక్రిందులయిందో లేక అదే పొజిషన్ లో ఉన్నదో పరీక్షించేందుకు.

డెక్ మీద తాత్కాలిక కంట్రోల్ ముందు ఆఫీసర్లు పోగయారు మళ్ళీ. అందరి తలలకూ ఇయర్ ఫోన్స్ ఉన్నయ్.

"హలో సార్! రిగ్ పొజిషన్ ఏమీ మారలేదు. అంతవరకూ మనం అదృష్టవంతులం" నీటి అడుగునుంచి ఫ్రాగ్ మెన్ వార్త అందించారు.

ఇనుమును కోసే యంత్రాల చుట్టూ నీళ్లు లోపలకు పోకుండా ప్లాస్టిక్ షీట్స్‌ని కట్టారు. దాన్ని ప్లాస్టిక్ డోమ్‌లో వుంచి మూత వేసేశారు. తర్వాత దాన్ని నీళ్ళ లోకి నెమ్మది నెమ్మదిగా, క్రమేపీ డెక్ మీదనుంచి జార విడువసాగారు. దాన్ని అంటి పెట్టుకుని మెకానికల్ ఇంజనీర్లు డైవింగ్ సూట్లలో దిగుతున్నారు క్రిందకు.

కెప్టెన్ భూపతి మైక్రోఫోన్‌ని చేతిలోకి తీసుకున్నాడు. నాలుకతో పెదాల్ని తుడుచుకున్నాడు. అతడి మనసులో నీడలాగ ఏదో శంక మెదలుతోంది.

హోస్ పైపుల్ని తీసివేయబోయే ముందు రిగ్‌లోని లాబ్ గదిలోంచి కొద్దిగా కలకలం విన్నాడు తను. ఇద్దరు మనుష్యులు కీచులాడుకుంటున్న ధ్వని. అరుపులు, బెదరింపులు! తను జాగ్రత్తగా ఆలకిస్తున్నాడు కనుక తను మాత్రమే వాటిని పసిగట్టాడు. మిగతావాళ్లు అంత శ్రద్ధగా వాటిని విన్నట్టు లేదు.

లోపల ఏం జరిగి ఉంటుంది? ప్రాణభయంతో ఇద్దరికీ మతి నిమితం తప్పలేదు గదా? లేక ఏ ఒకరికైనా వున్మాదం కలిగిందా?

కెప్టెన్ భూపతి గొంతు సవరించుకున్నాడు.

"హలో అరుణాచలం! హలో ఛటర్జీ! మా మాటలు వినవస్తున్నాయా? తుఫాను తగ్గిపోయింది. మళ్ళీ మన మనుషులు రిగ్ చేరుకున్నారు. మిమ్మల్ని వెలికి తీసే యత్నాలు మారుకుగా సాగుతున్నయ్! మీ గదిలోని

